# లిటిల్ మాస్టర్స్
# వ్యాకరణము




రచన :

షేక్ అలీ, ఎం.ఎ., బి.ఎడ్.,



పబ్లిషర్స్ :
నవరత్న బుక్ సెంటర్
కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ-2.

లిటిల్ మాస్టర్స్
సులభ వ్యాకరణము

ACC No. 31032

రచన :
డా॥ వి.వి. బాలకృష్ణ

ప్రథమ ముద్రణ :
డిసెంబరు-1998

ముఖచిత్రం :
త్రిగుణ్

494.8235
SH

ప్రచురణ హక్కులు :
బి.కె.ఆర్. మూర్తి (పబ్లిషర్)
విజయవాడ-2.
ఫోన్ : 432813

వెల : రు. 30-00

ముద్రణ :
విజయలక్ష్మి ఆఫ్‌సెట్ ప్రింటర్స్
విజయవాడ-2.

# మా లిటిల్ మాస్టర్స్ సిరీస్

1. ఇంగ్లీష్ - తెలుగు - డిక్షనరి
2. తెలుగు - ఇంగ్లీష్ - డిక్షనరి
3. తెలుగు - తెలుగు - డిక్షనరి
4. హిందీ - తెలుగు - డిక్షనరి
5. ఇంగ్లీష్ - ఇంగ్లీష్ - డిక్షనరి
6. ఇంగ్లీష్ - హిందీ - డిక్షనరి
7. హిందీ - ఇంగ్లీష్ - డిక్షనరి
8. తెలుగు - హిందీ - డిక్షనరి
9. కెమిస్ట్రీ - డిక్షనరి
10. ఫిజిక్స్ - డిక్షనరి
11. జువాలజి - డిక్షనరి
12. మాథ్స్ - డిక్షనరి
13. రసాయన శాస్త్రం - డిక్షనరి
14. ఇంగ్లీష్ - తెలుగు - గ్రామర్
15. ఇంగ్లీష్ ఎస్సేస్ అండ్ లెటర్స్
16. సులభ వ్యాకరణము
17. తెలుగు వ్యాసములు - లేఖలు
18. హిందీ - తెలుగు - స్వబోధిని
19. ఇంగ్లీష్ - తెలుగు - స్వబోధిని
20. 45 రోజుల్లో ఇంగ్లీష్
21. 45 రోజుల్లో హిందీ
22. హిందీ వ్యాకరణం (హైస్కూల్)
23. హిందీ వ్యాకరణం (ఇంటర్ & డిగ్రీ)
24. ఇంగ్లీష్ - తెలుగు ప్రైమర్
25. హిందీ - తెలుగు ప్రైమర్
26. హిందీ - ఇంగ్లీష్ - తెలుగు - త్రిభాషా వ్యాకరణం

## లిటిల్ మాస్టర్స్

1

# సులభ వ్యాకరణము



2.

## వర్ణ విభాగము
## విషయసూచిక

### వర్ణములు :

# 1. అక్షర పరిచ్ఛేదము Orthography.

శ్రీశైలము, కాళహస్తి, దక్షారామము, నను నీ మూడు పుణ్యక్షేత్రములమధ్య నున్న దేశమును త్రిలింగదేశమందురు. ఈ త్రిలింగ దేశమునందు, నివసించు జనులుపయోగించు భాషను, తెలుగు, లేక తెనుగందురు. ఈ భాషకే ఆంధ్రమనియు పేరు. సంస్కృతమునుండి కొన్నిశబ్దములును, ప్రాకృతమునుండి కొన్ని శబ్దములును ఈ తెనుగు భాషలోనికి వచ్చినవి. చాల భాషలకు మూలభాషయైన సంస్కృతమును, ఆద్య ప్రకృతి యనుచున్నారు. ఒక్కతెలుగు భాషకు మాత్రము, మూలభాషయైన, ప్రాకృతమును ద్వితీయ ప్రకృతి యనుచు న్నారు. సంస్కృత ప్రాకృతశబ్దములు, కొన్ని మార్పులను జెంది, తెలుగు భాషలో ప్రవేశించుచున్నవి. కాన ఆంధ్రభాష వికృతియని వ్యవహరింప బడుచున్నది.

భాషకును, లిపికిని సంబంధము చంద్రునకు, చంద్రికకు గల సంబంధము వంటిది. భాష తెలిసినంత మాత్రమున లిపి తెలియదు. ప్రతి నాగరిక భాషకు లిపియున్నట్లే, తెలుగు భాషకును, లిపికలదు. లిపికి అక్షరము మూలము. అక్షరమనగా నశింపనిది అని అర్థము. అక్షమనగా నాలుక - కంఠము మొదలగునవయవములు. వాని కదలికచే ప్రకాశించును కాబట్టి అక్షరము. అనగా ప్రత్యేక ధ్వనులు కలది. అక్షరమునకు 'వర్ణ' మను మరియొక పేరు గలదు. ఈ అక్షరములను దెల్పు భాగమును అక్షరపరిచ్ఛేదము - లేక - వర్ణపరిచ్ఛేదము అని పేర్కొనవచ్చును.

దేశభాషలందు లెస్స - యని ప్రశంసింపబడిన తెలుగు భాషకు అక్షరముల సంఖ్యఅధికము. నియమము లనంతము.

# వర్ణములు

సంస్కృతభాషకు అక్షరము లేబది. అ - ఆ - ఇ - ఈ - ఉ - ఊ - ఋ - ౠ - ఌ - ౡ - ఏ - ఐ - ఓ - ఔ - అం - అః - 16.

క - ఖ - గ - ఘ - ఙ

చ - ఛ - జ - ఝ - ఞ

ట - ఠ - డ - ఢ - ణ

త - థ - ద - ధ - న

ప - ఫ - బ - భ - మ

య - ర - ల - వ - శ - ష - స - హ - ళ - 34.

అకారము మొదలు క- కారమువరకు ఉన్న పదునా రక్షరములను అచ్చులందురు. (vowels) - తక్కిన ముప్పది నాల్గక్షరములు హల్లులు. (consonants).

ప్రాకృతభాషకు వర్ణములు నలుబది. ఇందు అచ్చులు పది. హల్లులు ముప్పది. అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఏ-ఓ-అం-అః-10.

క-ఖ-గ-ఘ- చ-ఛ-జ-ఝ ట-ఠ-డ-ఢ-ణ-

త-థ-ద-ధ-న- ప-ఫ-బ-భ-మ-

య-ర-ల-వ-స-హ-ళ - 30.

తెలుగుభాషకు వర్ణములు ముప్పది యేడు - 37

ఇందు - హల్లులు - ఇరువదిమూడు.

అచ్చులు - పదునాలుగు.

అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఎ-ఏ-ఐ-ఒ-ఓ-ఔ-అం-అః -14

క - గ - చ - చ఼ - జ - జ఼ - ట - డ -

ణ - త - ద - న - ప - బ - మ - య -

ర - ఱ - ల - వ - స - హ - ళ - 23.

## (2) అచ్చులు

(హ్రస్వములు - దీర్ఘములు అని రెండు విధములు.)

అ-ఇ-ఉ-ఋ- ఌ -ఎ-ఒ-ఈఏడును హ్రస్వములు. హ్ర స్వములనగా కురుచగా పలుకబడునవి.

ఆ-ఈ-ఊ-ౠ ౡ-ఏ-ఐ-ఓ-ఔ. ఈ తొమ్మిది దీర్ఘములు. దీర్ఘములనగా చాచిపలుకబడునవి.

ఐ-ఔ-లు వక్రతమములు. ం,-ః -:ఉభయాక్షరములు.

అచ్చులకు ప్రాణములనియు, హల్లులకు ప్రాణులనియు పేర్లు. క్రమముగా స్వరములు - వ్యంజనములనియు వ్యవహరింపబడు చున్నవి. హల్లులు ఐదు వర్గములుగా విభజింపబడినవి.

క ఖ గ ఘ ఙ - క వర్గము.
చ ౘ ఛ జ ౙ ఝ ఞ - చ వర్గము.
ట ఠ డ ఢ ణ - ట వర్గము.
త థ ద ధ న - త వర్గము.
ప ఫ బ భ మ - ప వర్గము.

వర్గ ప్రథమాక్షరములైన క చ ట త ప లు పరుషములు.
వర్గ తృతీయాక్షరములైన గ జ డ ద బ లు సరళములు.
ప్రతి వర్గములోని సరియక్షరములు ఖ,ఘ,ఛ,-ఝ -ఠ -ఢ - థ-ధ - ఫ -భ అను వర్గయుక్కు లందురు.

ఖ, ఘ, ఙ, ఛ -ఝ -ఞ- ఠ- ఢ- ణ- థ- ధ- న ఫ- భ- మ- య- ర- ల- వ- శ- ష- స- హ- ళ- లను స్థిరములందురు.
య ర ల వ లు అంతస్థములు.
శ- ష- స- హ- లు ఊష్మములు.
క మొదలు మ వరకు ఉన్న వర్ణములు స్పర్శములు.

# 3. వర్ణోత్పత్తి స్థానములు

అ ఆ క ఖ గ ఘ ఙ హః వీనికి ఉత్పత్తి స్థానము

కంఠము.

ఇ ఈ చ ఛ జ ఝ య శ - తాలువు.

ఋ ట ఠ డ ఢ ర ష- మూర్ధము.

ౘ ౙ త థ ద ధ న ల స- దంతములు.

ఉ ఊ ప ఫ బ భ మ - ఓష్ఠము.

ఞ మ ఙ ణ న - నాసిక.

ఎ ఏ ఐ - కంఠతాలువు.

ఒ ఓ ఔ - కంఠోష్ఠ్యము.

వ - దంతోష్ఠము.

అంతస్థములు - స్పర్శములకు - ఊష్మములకు మధ్య నుం డునవి.

య ర ల వ లు.

ఇవి లఘువులని, అలఘువులని రెండు విధములు. వీనిని ఒక్కొక్క చోట తేల్చి పలుకుటయు, మరొకచోట ఊదిపలుకుటయు కలదు. తేల్చిపలికినపుడు లఘువులు. ఊది పలికినపుడు అలఘువులు.

సంధి వశమున వచ్చిన 'య'కార వకారములు లఘువులు. అనగా తేల్చి పలుకబడునవి.

హరి + అతడు = హరియతడు.

నిద్ర + పోయెను = నిద్రవోయెను.

ఇచ్చట యకారవకారములు సంధివశమున వచ్చినవి.

శబ్దము తోడనే పుట్టిన య కార వ కారములు అలఘువులు. అనగా ఊదిపల్లునవి.

వంకాయ - వంకర -

చాయ - కోయుట - ఇందలి యకార

వకారములు సంధివశమున వచ్చినవికావు. అరదము - ఉరుదు - ఇందలి సాధురేఫలు లఘువు.

ఏఱుగు - విఱుగు - ఇందలి శకట రేఫము అలఘువు.

కలత - చలము - వలస - ఇందలి లకారము లఘువు.

బహువచనము పరమగునపుడు ర ల డ వర్ణములకు ఆదేశముగా వచ్చిన ళకారము అలఘువు.

త్రాళ్లు - గోళ్లు - ఏళ్లు - పాళ్లు. - మేళము - తాళము - మొదలగు పదము లందుగల ళకారము వర్ణాంతరము గాని అలఘు ళకారము కాదు.

## 4. రేఫలు

రేఫము సాధురేఫమనియు, శకటరేఫమనియు రెండు విధములు. ఇది సంస్కృత భాషయందులేదు. కేవలాంధ్ర భాషయందు మిక్కిలి పరిపాటిగా చూడబడుచున్నది. కాని తత్సమశబ్దమయమైన •ఆంధ్ర భాషయందు ర ఱ ల భేదము కనుగొనుట మిక్కిలి కష్టము. ఇతర ప్రయోజనము ఎట్లున్నను, సంస్కృతాంధ్ర శబ్ద పరిజ్ఞానమునకు మాత్రమిది యుపయోగము. ద్విత్వముతో కూడు కొన్నవియు, వాని రూపాంతరములును శకటరేఫలు.

మొఱ్ఱ - మొఱ. పుఱ్ఱె - పుఱియ.
బొఱ్ఱె - బొఱియ. కఱ్ఱె - కఱియ.
చుఱ్ఱు - చుఱచుఱ. కిఱ్ఱు - కిఱకిఱ.
గుఱ్ఱు - గుఱగుఱ, బఱ్ఱు - బఱబఱ.
గొఱ్ఱె - గొఱియ. పఱ్ఱు - పఱపఱ.

శకట రేఫములు సంయుక్తములు కావు.

చఱువు - మెఱసె.
మఱువు - వెఱచె.
ఒఱువు - అఱువు.
అఱచ - పిఱుదు.
పఱచె - అఱకలు.

అదు - ఉవు - ఉము - అంతమందు గల శబ్దములు శకటరేఫలు.
కఱదు - కఱువు - ఉఱుము
ఒఱదు - మఱువు - మెఱుము.
పెఱదు - చెఱువు - నుఱుము.

అన్యవర్ణములతో సంయుక్తములైయున్న శబ్దములు శకటరేఫలుగావు.
తనర్చె - పొనర్చె - ఒనర్చె.

## 5. తాలవ్యములు – దంత్యములు – అని చ – జ లు రెండు విధములు.

ఇ - ఈ - ఎ - ఏ అను అచ్చులతో కూడియున్న చ - జ లు తాలవ్యములు.

ఉ : చిగురు - చీర - చెలిమి
చేడియ - జిగి - జీతము.
జెండా - జేన - మొదలైనవి.

| | |
|---|---|
| మొఱ్ఱ - మొఱ. | పుఱ్ఱె - పుఱియ. |
| బొఱ్ఱి - బొఱియ. | కఱ్ఱి - కఱియ. |
| చుఱ్ఱు - చుఱచుఱ. | కిఱ్ఱు - కిఱకిఱ. |
| గుఱ్ఱు - గుఱగుఱ, | బఱ్ఱు - బఱబఱ. |
| గొఱ్ఱి - గొఱియ. | పఱ్ఱు - పఱపఱ. |

శకట రేఫములు సంయుక్తములు కావు.

చఱువు - మెఱసె.

మఱువు - వెఱచె.

ఒఱుపు - అఱుపు.

అఱచ - పిఱుదు.

పఱచె - అఱకలు.

అదు - ఉపు - ఉము - అంతమందు గల శబ్దములు శకటరేఫలు.

కఱదు - కఱువు - ఉఱుము

ఒఱదు - మఱువు - మెఱుము.

పెఱదు - చెఱువు - నుఱుము.

అన్యవర్ణములతో సంయుక్తములైయున్న శబ్దములు శకటరేఫలుగావు.

తనర్చు - పొనర్చు - ఒనర్చు.

# 5. తాలివ్యములు - దంత్యములు - అని చ - జ లు రెండు విధములు.

ఇ - ఈ - ఎ - ఏ అను అచ్చులతో కూడియున్న చ - జ లు తాలివ్యములు.

ఉ : చిగురు - చీర - చెలిమి
చేడియ - జిగి - జీతము.
జెండా - జేన - మొదలైనవి.

అ - ఆ - ఉ - ఊ - ఒ - ఓ - ఔ - అను అచ్చులతో కూడియున్న చ జ లు దంత్యములు.

ఉ :- చమురు - ఛాకలి - చుంచు - చూలు - చొక్లెము - చోడి - చౌదంతి - జత - జాతర - జుట్టు - జూదము - జొంపము - జోదు - జౌకు - తాలవ్య చ - జ లకు చెప్పిన కార్యములన్నియు దంత్య చ - జ లకు కూడా వచ్చుచుండును. చ కారముతోపాటు ఛకారము కూడ పరుష సంజ్ఞ కలది యగుచున్నవి. ఇట్లే జ కారముతో పాటు జ కారముకూడ సరళ సంజ్ఞ కలదియగుచున్నది. దంత్యతాలవ్యములగు చ - జ లను పరస్పరము యతి ప్రాసలకు కూర్చవచ్చును. అందువల్ల దంత్యతాలవ్యములైన చ జ లను సవర్ణములనుచున్నారు.

## 6. బిందువు

తెలుగు భాషయందు బిందువులు రెండు విధములు. అవి పూర్ణ బిందువు, ఖండ బిందువులు.

ఉ : కంచె - గంటము - వంట - పూర్ణ బిందువులు.
తోఁట - కోఁతి - ఖండ బిందువులు.

సిద్ధము - సాధ్యము అని బిందువులు రెండు రకములు.

శబ్దములందు స్వతసిద్ధముగానున్న బిందువులు సిద్ధబిందువులు.

ఉదా : మంద - మంట - ఁకాపురము - దూఁట - మొదలైనవి.

వ్యాకరణ సూత్రమువల్ల కలుగు బిందువులు సాధ్యబిందువులు.

బిందువుండును కాని, యితర వర్ణములకు పూర్వమందు బిందువుండదు.'' కంసాలి జాతివాఁడు చాలలేదు'' అని ప్రయోగము కానం బడుచున్నది.

వ్యాజ్యెము - ర్యాలి - (ఒక గ్రామము - పశ్చిమగోదావరి జిల్లా తణుకు తాలూక లోనిది) మున్నగు లెక్కకు వచ్చు కొన్ని పదములలో దక్క రేఫేతర హల్లుతో సంయుక్తమైన వర్ణము తెలుగులో పదాదినుండదు.

## విభక్తులు

ఒక పదమునకు వాక్యమున నితరపదములతో గల సంబంధమును విభక్తి అందురు. ఇవి ఏడు విధములుగా నుండును. వానినే యేడు విభక్తులందురు. విభక్తులను వర్ణకములని గూడ అందురు.

## ఏడు విభక్తుల స్వరూపము

| విభక్తి | ఏక వచనము | ఉదా హరణము | బహు వచనము | ఉదా హరణము |
|---|---|---|---|---|
| ప్రథమా విభక్తి (Nominative case) | డు- ము - వు | రాముడు పాము ఆవు | లు | రాములు పాములు ఆవులు |
| ద్వితీయ విభక్తి | ని - ను | రాముని పామును | ం | రాములను పాములను |

| విభక్తి | ఏక వచనము | ఉదాహరణము | బహువచనము | ఉదాహరణము |
|---|---|---|---|---|
| తృతీయ విభక్తి | చేత- తోడ- చే-తో | రామునిచేత - రాముని తోడ | లు | రాములచేత రాములతోడ |
| చతుర్థీ విభక్తి | కొఱకు- కై | రాముని కొఱకు రాముని కై | లు | రాముల కొఱకు రాముల కై |
| పంచమీ విభక్తి | వలన కంటె పట్టి | రాముని వలన మొ. | లు | రాముల వలన |
| షష్ఠీ విభక్తి | కి. కు యొక్క లోపల | రామునకు - రామునికి మొ. | లు | రాములకు మొ. |
| సప్తమీ విభక్తి | అందు న | వనము నందు వనమున | లు | వనములయందు రాములయందు |

ఈ యేడు విభక్తులను తెలియ జేయుటకై పదముల చివర వచ్చు వానిని ప్రత్యయములందురు. పై ప్రత్యయములలో డు-ము-వు-న- అనునవి ఏకవచనములు. లు. బహువచన రూపము.

## 7. నకారము ద్రుతము

ద్రుతము అంతమందుగల పదములు ద్రుత ప్రకృతికములు. ద్రుతము అనగా కరగునది అని అర్థము. కావలసిన వల్ల కనుపట్టుచు అవసరమైన యెడల లోపించునది.

1. విభక్తులలో ప్రథమ, కూర్చి, కయి, పట్టి, యొక్క, తప్ప తక్కినవి ద్రుతప్రకృతికములు
2. తాను - నేను శబ్దములు ప్రథమావిభక్తిలో కూడా ద్రుతప్రకృతికములు.
3. సమాసక్రియలలో - నాలుగు కాలములయందలి ఉత్తమ పురుషైక వచనములు.

భూాత తద్ధర్మ కాలములందలి ప్రథమ పుపురాషైకవచనములు.

ఆశీరర్థకమున వచ్చు ఎడుత అను ప్రత్యయములును ద్రుతప్రకృతికములు.

4. ధాతువులనుండి ఏర్పడు అవ్యయములలో శతృతుమానంతర్య చేదర్థకములు ద్రుతప్రకృతికములు.
5. సముచ్చయార్థకమునందు వచ్చు యు-ను- అనునవి ద్రుతప్రకృతికములు.
6. పుట్టుకతోనే అవ్యయములుగా ఉన్న వలె-పోలె-ఎల్ల-ఎట్టకేలకు పిదప - బాల - కూడ - మీఁద - కనుక - కావున తప్ప - మిగుల - అంతట - అయిన - ఆవల మొదలగునవి ద్రుతప్రకృతికములు.

ఉదా :

ద్వితీయ : రామునిన్

తృతీయ : రామునిచేతన్ - రామునిచేన్ - రామునితోడన్ - రామునితోన్

చతుర్థి: రాముని కొఱకున్

పంచమి : రాముని వలనన్, రాముని కంటెన్

షష్ఠి: రామునికిన్ - రామునకున్ రాములలోపలన్

సప్తమి : రామునియందున్ -
వర్తనమానకాలము : చదువుచున్నాను.
భూతకాలము : ఉత్తమపురుష చదివితిని.
భవిష్యత్ కాలము : ఉత్తమపురుష చదువగలను.
తద్ధర్మకాలము : ఉత్తమపురుష చదువుదును-చదివెదను.
వ్యతిరేకార్థము : చదువను.
భూతకాలము : ప్రథమ. చదివెను.
తద్ధర్మ కాలము : ప్రథమ.

చదువును - చదివెదును - చదివెడిని.

ఆశీర్వర్థకము : అయ్యెడున్ - కావుతిన్.

శత్రర్థకము : చదువుచున్.

తుమున్నర్థకము : చదువన్ - చదువగాన్ - చదుగావన్.
అనంతర్యర్థకము - చదువుడున్.
చేదర్థకము - చదివినన్.

ద్రుతప్రకృతికములు కాని శబ్దములు కళలు. అవి - డు,ము,వు,లు,కూర్చి, గుఱించి, కై పట్టి, యొక్క. చివర కం పదములు కళలు.

అసమాపకక్రియలలో క్త్వార్థక, వ్యతిరేక క్త్వార్థకములైన చదివి - చదువక - మొదలైనవి కళలు.

అవ్యయములైన కాబట్టి - మిక్కిలి - కొంచెము మొదలైనవి కళలు.

ధాతుజ విశేషములన్నియు కళలే.

వచ్చు రాముడు - వచ్చిన రాముడు.

సమాపకక్రియలలో వత్తురు - వచ్చిరి - రారు - రాదు - మొదలైనవి కళలు.

కొన్ని సూత్రములు :

1. తెనుగు పదముల మొదట రావడి, తక్క, తక్కిన, వడులు లేవు.

ప్రాంత - ప్రాంకు - త్రుప్పు - క్రింద మొదలగునవి. (వ్యాజ్యము అను పదమొకటి కనబడుచున్నది.)

2. తఱుచుగా తెనుగు పదములలో ఒక అకారమునకు ఆవడియే వచ్చును. వ్యత్యస్తాక్షర సంశ్లేషములు లేవు.

అక్క - చెక్క - మగ్గము - అగ్గి - మచ్చిక - సజ్జ - మజ్జిగ - కట్ట - పట్టు - గడ్డి - అడ్డు - చెత్త - సత్తు- సుద్ది - మద్ది - అన్న - తెన్ను - అప్ప - కొప్పు - జెబ్బ - గొబ్బు - కమ్మి - తమ్ముడు - అయ్య - కుయ్య - మల్టి - బట్టె - చల్ల - తల్లి - అవ్వ - సువ్వి - తొస్సి - మొదలగునవి.

3. తద్భవములయందును, దేశ్యవదముల యందును స కార - త కార సంశ్లేషము కలదు.

అంతస్తు - అస్తరు - గేస్తుడు - నేస్తము - ముస్తె - కస్తి - సిస్తు - మొదలగునవి.

4. యావడి కలవి తద్భవ దేశ్యము లందు కొన్నికలవు. జోస్యుడు - పణ్యారము - వ్యాజ్యెము - ముత్యెము - మొదలగునవి.

5. తావు - ధాక - అవధారు - వసనాభి - అఱభి - మున్నగు తద్భవ దేశ్యపదములలో వర్గయుక్కులు కలవు.

6. హ కారము అనునాసికములు వత్తుగ వచ్చినప్పుడు అనునాసిక స్వరమే ముందుగ ఉచ్చరింపవలెను.

బ్రహ్మ పలుక వలసినది (బ్రంహ్మ అని) చిహ్నము - మధ్యాహ్నము - అపరాహ్నము - జిహ్మగము మొదలైనవి.

7. పదము మొదట అర సున్నాగాని, నిండు సున్నాగాని యుండదు.

8. వర్గయుక్కులు వర్గయుక్కులతోనే ద్విత్వములై యుండవు. ఎబ్బంగి - దిగ్గస్తి - జగద్ధితము - ఉద్ధారణము.

9. ఉయ్యెల - పయ్యెద - తాయెతు - అను మూడు నామపదము లందు మాత్రమే నడిమి యకారము ఎత్వము కలదిగా ఉన్నది. కనియెన్ - వినియెన్ - మొదలగునవి క్రియలు.

10. కష్టము - అనుపదము తక్క .

## ప్రశ్నలు

1. సంస్కృత భాషకు అక్షరము లెన్ని ? అవిఏవి ?
2. ప్రాకృత భాషకు అక్షరము లెన్ని ? అవి యేవి ?
3. తెనుగు భాషకు అక్షరము లెన్ని ? అవి యేవి ?
4. అచ్చులెన్ని ? అవి యేవి ? హల్లులెన్ని ? అవి యేవి ?
5. ఉభాయాక్షరములెన్ని ? అవి యేవి ?
6. స్వరము లేవి ? ఎందువలన ?
7. వ్యంజనము లేవి ? ఎందువలన ?
8. వక్రములు - వక్రతమములనగానేవి ? అవియేవి ?

9. వర్గములెన్ని ? అవియేవి ?
10. వర్ణోత్పత్తి స్థానముల దెల్పుము ?
11. య - వలు - లఘువు - అలఘువు వెల్లగును తెల్పుము ?
12. రేఫము - లఘు - అలఘు రేఫములను గూర్చి వ్రాయుము.
13. దంత్య, తాలివ్య చ, జ లను గూర్చి వ్రాయుము.
14. బిందువు - ప్రాధాన్యతను వివరింపుము.
15. విభక్తు లెన్ని ? అవియేవి ?
16. ద్రుతము - కళలు - వీనిని సోదాహరణముగ వివరింపుము ?

## (2) పదవాక్య విభాగము

**I. పదములు.**

1. తత్సమ పదములు.
2. తద్భవ పదములు.
3. దేశ్యపదములు.
4. గ్రామ్యపదములు.
5. అన్యదేశ్యపదములు.

**II. భాషా భాగములు.**

1. నామవాచకములు.
2. సర్వనామములు.
3. క్రియలు.
4. విశేషణములు.
5. అవ్యయములు.

**III. వాక్యము.**

# పదపరిచ్ఛేదము - Etymology

అర్థవంతమైన అక్షరముగాని, అర్థవంతమైన అక్షరసముదాయము గాని పదమనబడును. పదములు పూర్ణార్థమునీయక వాక్యాంశములై యుండును. తెలుగు భాషయందు ఐదు విధముల పదములు గలవు.

1. తత్సమములు.
2. తద్భవములు.
3. దేశ్యములు.
4. అన్యదేశ్యములు.
5. గ్రామ్యములు.

## తత్సమములు

తెనుగు భాషయందు తత్సమములు 14814, తద్భవములు 2083, దేశ్యములు 12337 కలవని నిఘంటు వలన తెలియుచున్నది.

చరిత్ర మొదలగు పదములకు మువర్ణకంబు కలిగి యొక రూపమును లేక ఒక రూపమును కలదు.

చరిత - అణిమ - అక్షత - అర్పణ - ఆరాధన - కంధర - గరిమ - గ్రీవ - చామర - తరంగ - దంష్ట్ర - నటన, - పఠన, - పాదుక, - పారణ - ప్రశ్న - భ్రమ - భిక్ష - మహిమ - లఘిమ - వధ - వేధ - హంస - మొదలైనవి.

కుశ - దర్భ - మొదలగు కొన్ని పదములకు ము వర్ణ కంబు రాదు.

దీర్ఘములగు ఏకాక్షర పదములు కురుచలు కావు.

శ్రీ - హ్రీ - ధీ - గ్లా - స్త్రీ - మా. మొదలైనవి.

మిత్ర శరణ ప్రధాన పాత్రాదులు పుల్లింగ రూపముననుె, నపుంసక రూపమున నుండును.

మిత్రము - మిత్రుడు - శరణము - శరణుడు - ప్రధానము - ప్రధానుడు - పాత్రము - పాత్రుడు -- భాజనము - భాజనుడు - వృద్ధుడు. మొదలగు కొన్ని పదములలోడు - వర్ణ కంబు లోపించును. ఉత్వము లోపించదు.

వృద్ధుడు - వృద్ధు; గృహస్థుడు - గృహస్థు; మూర్ఖుడు - మూర్ఖు; నీచుడు - నీచు; చార్వాకుడు - చార్వాకు - మొదలైనవి.

దూత మొదలగు కొన్నింటికి ఉత్వ'డు', వర్ణకంబులు లోపించును.

దూతుడు - దూత

యోధుడు - యోధ

శుంతుడు - శుంఠ మొదలైనవి.

విశ్వకర్మ మొదలగు పదములకు ఉత్వ'డు', వర్ణకంబులు రావు.

విశ్వకర్మ - కృష్ణవర్మ - అశ్వత్థామ - యజ్వ - బ్రహ్మమొదలైనవి.

దీర్ఘంబు మీది హల్లునకు ద్విత్వంబు వైకల్పికము.

వాక్కు - వాకు; విరాట్టు - విరాటు - మనస్సు మొదలగు పదములకు ద్విత్వము వైకల్పికము. 'స'కారంబు లోపమై ము వర్ణకము వచ్చును.

మనస్సు - మనసు - మనము

శిరస్సు - శిరసు - శిరము.

సదస్సు - సదసు - సదము.

కొన్నింటికి 'ము' వర్ణకము రాదు.

హవిస్సు - పయస్సు - వయస్సు మొదలైనవి.

**తత్సమముల గుర్తించు విధము. :-**

ఋ - ౠ - ఌ - ౡ - విసర్గ - ఖ - ఛ - ఠ - థ - ఫ - ఘ - ఝ - ఢ - ధ - భ - జ - ఞ - శ - ష - లు గల శబ్దములు.

**సంస్కృత సమములు. :**

కృప - పితౄణము - క్లృప్తి - ౡ -కారము పయఃపానము - ఖడ్గము - ఛత్రము - కంఠము - రథము - ఫలము - ఘటము - ఝరము - ఢక్క - ధనము - భరము - శార్ఙ్గము - ఆజ్ఞ - శరము - షండము.

య కారమును జై - చై - లును - మొదట గల శబ్దములు సంస్కృత సమములు.

యతి - యావకము - యియాసువు - యుక్తము - యూపము - యోగము - యౌవనము - మొదలగు యాది శబ్దములును, జైమిని - చైత్రము మొదలగు జై - చై మొదట గల శబ్దములును సంస్కృత సమములు.

షకారములకు ముందు బిందువు గల పదములు సంస్కృత సమములు.

సంయమి - హంస - సింహము - మొదలగు. క్రావడి కాక యితర సంయోగ మాదియందు గల శబ్దములు సంస్కృత సమములు.

స్పందనము - గ్లాని - క్వాచిత్కము - స్నానము - క్షమము - స్వరము - మొదలగునవి.

అ - ఆ - ఉ - ఊ - ఓ - ఔ లతో కలిసి యు తా ల వ్య చ - జలు గల శబ్దములు సంస్కృత సమములు.

చంద్రుడు - చామరము - చంద్రిక - చూర్ణము - చోరుడు - చౌర్యము - జట - జాతి - మంజులము - జూటము రజోగుణము - వ్రజౌకము మొదలగునవి.

త్ర్యాది సంయోగము గల శబ్దములు సంస్కృత సమములు.( త్రి + ఆది =(త్ర్యాది)

మత్స్యము - అగ్ర్యము - కార్త్స్న్యము మొదలగునవి.

సమాసముల మారు శబ్దములు సంస్కృత సమములు.

ధనము - ధనాఢ్యుడు.

వనము - వనవాసము.

రాముడు - రామ బాణము.

హలంత శబ్దములు (తత్సమములు) సంస్కృత సమములు.

దిక్ - దిగీశుడు

అజ్ - అజంతము.

చిత్ - చిదంబరము.

రాట్ - రాట్కులము.

కకుప్ - కకుబంతము మొ..లైనవి.




తద్భవములు వర్ణలోప - వర్ణాగమ - వర్ణాదేశ - వర్ణ వ్యత్యయంబుల పొంది యేర్పడుచున్నవి. ఇవి వికృతులు.

వర్ణ లోపము : (అక్షర లోపము)

హరణము - అరణము . పరీక్షించు - పరికించు.

ప్రయాణము - పయనము. స్మరుడు - మరుడు.

పటోలి - పొట్ల.

యశము - అసము.

పున్నాగము - పొన్న.

ఉపాధ్యాయుడు - ఒజ్జ.

వర్ణాగమము (అక్షరము అధికముగా వచ్చును)

రాత్రి - రాతిరి; యాత్ర - జాతర

జీరకము - జీలకఱ్ఱ; యత్నము - జతనము.

పుష్పము - పొరటు; వృషభము - బసవడు.

హర్షము - అరుసము.

వర్ణాదేశము :- ఉన్న అక్షరము పోయి క్రొత్తది వచ్చుట.

నీరము - నీరు; ఇంగాలము - ఇంగలము

యముడు - జముడు; వకుళము - పొగడ

పూగము - పోక; కుబ్జుడు - గుజ్జు

రూపము - రూపు కలశము - కడవ

వర్ణవ్యత్యయము (అక్షరముల తారు మారు)

అలీకము - కల్ల; కక్షము - చంక

శుచి - చిచ్చు; పంకించు - పంపించు

**అర్థ భేదముచే వికృతులు భేదించును.**

పూగము (గుంపు) ప్రోగు.

పూగము - (వక్క) పోక.

కాలము (సమయము) కారు.

కాలము (నలుపు)కాఱు.

భిన్నపదములకు ఏకరూపమగు వికృతులుండును.

కృత్తిక - కత్తెర. కర్తరి - కత్తెర.

కాలము - కాఱు. గహనము - కాఱు.

కొన్ని పదముల కొక యర్థమున వికృతి యుండి యొకప్పుడు లేకుండును.

వంశము (కులము) వంగడము. వెదురు అర్థమున వికృతి లేదు.

పురము (పట్టణము) ప్రోలు.

దేహమను అర్థమున వికృతి లేదు.

ఒక్క యర్థముననే కొన్ని పదముల కనేక వికృతులుండును.

| మృగము | మెకము | హృదయము |
|---|---|---|
| | మెగము | ఎద |
| | | ఎడద |

అన్ని పదములకు వికృతులుండవు. కొన్నిటిలో మాత్రమే వికృతులుండును.

## దేశ్యములు

త్రిలింగ దేశ వ్యవహార సిద్ధమగు భాష వ్యాకరణముననుసరించి తెనుగు దేశమునందు గ్రంథములందు వాడు భాష దేశ్యము.

పాలు - పెరుగు తల్లి - తండ్రి

అక్క - అన్న మొదలైనవి.

ఊరు - పేరు - తల్లి - తండ్రి - మొదలగు మాటలు తద్భవములు - తత్సమములు కాక మన భాషలో వ్యవహరింప బడుచున్నవి. ఇట్టివి దేశ్యములు.

## అన్య దేశ్యములు

ఇతర దేశ భాషా పదములైయుండి కాలక్రమమున తెలుగు భాషా పదములలో కలిసి పోయినవి.

**ఆంగ్లము :** రైలు- టికెటు - కార్డు- పెన్ను.
**హిందీ :** దస్తావేజు - హాజరము
**తమిళము :** కెలసము - తిరుమణి - తిరుచూర్ణము.

## గ్రామ్యము

లక్షణ - (వ్యాకర) విరుద్ధమగు భాష గ్రామ్యము. ఇది ప్రత్యేక భాష కాదు. దేశ్యము మొదలగు వాని అపభ్రంశమే గ్రామ్యము.

రామునికి - బదులుగా రాముడికి.
సంతోషము - బదులుగా సంతోషం అనుట గ్రామ్యమే.

కూ కో - లెగు - ఏంది - మొదలగునవి నింద్య గ్రామ్యములు. ఇట్టివి గ్రంథములందు వాడరాదు. అనుకరణమునందు గ్రామ్యము ప్రయోగింప వచ్చును.

'' మొక్కేముసామి ''యని వేట గాండ్రనిరి. మొ..లగునవి ఆర్యవ్యవహార దృష్టమునింద్యము.

కఱకంఠుడు - ప్రాణగొడ్డము.
దినవెచ్చము - రాయభారము మొ..నవి. ఈ ప్రయోగములు నన్నయ - శ్రీనాథాది మహాకవులవి. వీనికి అనింద్యగ్రామ్యమని పేరు. కొందరు వీనిని తద్భవములను చున్నారు.

# భాషా భాగములు

తెలుగు పదములు అయిదు విధములు .అవి.

1. నామవాచకములు (Nouns)
2. సర్వనామములు (Pronouns)
3. విశేషణములు (Adjectives)
4 అవ్యయములు (Propositives)
5. క్రియలు (Verb)

## 1. నామవాచకములు (Nouns):

వీనిని విశేష్యములందురు. ఇంద్రి యాదులకు గోచరించు వస్తువులను గూర్చి తెలియ జేయునవి నామ వచకములు. ఇవి ఏడు విధములు.

**1. సంజ్ఞా నామవాచకము. (Proper noun):** ప్రత్యేకముగా ఒక్కొక్క దానికి పెట్టబడిన పేర్లను గూర్చి తెలుపునవి.

**ఉదా:** బొంబాయి - రాముడు - హిమాలయము - గంగా- మొదలైనవి.

**2. జాతి నామవాచకము (Common noun):** జాతిని గూర్చి ప్రత్యేకముగా తెల్పునది.

**ఉదా:** మేక - ఆవు- కోతి - కుక్క. మొదలైనవి.

**3. గుణ నామవాచకము:** మనుష్యులయొక్క, ప్రదేశముల యొక్క గుణమును గూర్చి తెలుపునవి.

**ఉదా:** నలుపు- తెలుపు- పులుపు- మొ..నవి

**4. సమూహ నామవాచకము (Collective noun):** మనుష్యుల యొక్క గాని, వస్తువుల యొక్కగాని

ప్రత్యేకముగా ఏకరాశిగా తెల్పునవి.

ఉదా : గుంపు, మంద, రాశి, ప్రోగు.

5. **భావ నామవాచకము :** ఇంద్రియ గోచరముగాని మనోభావముల దెల్పునవి.

ఉదా : తెలివి - ధర్మము - న్యాయము - ప్రేమ - హర్షము.

6. **క్రియా నామవాచకము. :** క్రియలనుండి పుట్టినవి.

ఉదా : నేయు - నేత -కోయు - కోత
వండు - వంట - నడుచు - నడక.

7. **లోహాది నామవాచకము :** లోహాది ఘన పదార్థములను, ధాన్యమును గూర్చి తెల్పునవి.

ఉదా : బంగారము - వెండి - ఊయి - బియ్యము.




1. మహద్వాచకము
2. మహతీవాచకము
3. అమహద్వాచకములు

తెలుగు భాషయందు మహద్వాచకము - మహతీవాచకము, - అమహద్వాచకమని లింగములు మూడు విధములు. వీనినే మహదర్థకము - మహత్యర్థకము - అమహదర్థకము అని వ్యవహరింతురు. దేవ మనుష్య జాతులలోని పురుష నామములకు మహద్వాచకములని పేరు.

ఇంద్రుడు - రావణుడు - హరి - రాముడు - రంగడు - ఇత్యాదులు.

# విభక్తులు: ఏక – బహువచనములు

ప్ర. వి: రాముడు - వనము - ధేనువు - (ఏక)
చిలుకలు - (బహు)

ద్వి. వి: రాముని - వనమును - (ఏక)
ధేనువులన్ - చిలుకలగూర్చి (బహు)

తృ. వి: రాముని చే - వనముచే - ధేనువుతో - (ఏక)
చిలుకలతోడన్ - (బహు)

చ. వి: రాముని కొఱకు - వనమునకై- ధేనువునకై- (ఏక)
చిలుకల కొఱకున్ - (బహు)

పం. వి: రాముని వలనన్ - వనమున కంటెన్ - ధేనువు నుండి.(ఏక)
చిలుకల పట్టి - (బహు)

ష. వి: రామునికిన్ - వనమునకున్ - ధేనువుయొక్క - (ఏక)
చిలుకలలోన్ - (బహు)

స. వి:- రాముని యందున్ - వనమునన్ - ధేనువునందున్ - (ఏక)
చిలుకల యందున్ - (బహు)

సంబోధనా ప్రథమావిభక్తి:-

ఓ రాముడా!
ఓ రాముడ!
ఓసి చిలుకా!
ఓసీ చిలుక!
ఓయి రామా! ఓరి రామా!
ఓయీ రామ! ఓరీ రామ!

పై చెప్పబడిన ప్రథమా విభక్తి ప్రత్యయములు ఎవ్వియు కనిపింపకున్నను, ఆ పదము నామవాచకముగా గాని, సర్వనామముగాగాని యుండి ఇతర విభక్తి ప్రత్యయము లెవ్వియు నందు కన్పింపకున్నచో అది ప్రథమాంతముగ గ్రహించవలెను.

చిలుక - అన్న - సీత - రాజు - హరి - మొ..నవి.

## విశేషాంశములు

సంస్కృత పదములు కొన్నింటికి -
ఇ - ని - అ - ఇక మొదలగు ప్రత్యయములు చేర్చుట వలన పుల్లింగములు స్త్రీ లింగములుగా మారును.

| పుం. | - స్త్రీ. (ఇ) | పుం. | - స్త్రీ (అ) |
|---|---|---|---|
| జనకుడు | - జనని | బాలుడు | - బాల |
| బ్రాహ్మణుడు | - బ్రాహ్మణి | సుతుడు | - సుత |
| పద్మాక్షుడు | - పద్మాక్షి | పద్మనేత్రుడు | - పద్మనేత్ర |
| ప్రభువు | - ప్రభ్వి | శూద్రుడు | - శూద్ర |
| సుందరాంగుడు | - సుందరాంగి | ధన్యుడు | - ధన్య |
| దేవుడు | - దేవి | ప్రియుడు | - ప్రియ |
| కర్త | - కర్త్రి | | |

| (ని) | | (ఇక) | |
|---|---|---|---|
| బుద్ధిశాలి | - బుద్ధిశాలిని | బాలుడు | - బాలిక |
| చక్రవర్తి | - చక్రవర్తిని | దూతుడు | - దూతిక |
| రాజు | - రాజ్ఞి | పుత్రుడు | - పుత్రిక |
| యశస్వి | - యశస్విని | పరిచారకుడు | - పరిచారిక |

# నిత్యైక వచనములు

బహు వచనములు లేనివి, నిత్యైక వచనములు.

1. బంగారము - వెండి - రాగి - ఇనుము - సీసము - కంచు - ఇత్తడి - తుత్తనాగము మొదలైనవి.
2. నిన్న - మొన్న - రేపు - మాపు - అప్పుడు - ఇప్పుడు - ఎప్పుడు - మొదలగు కాలముల దెలుపునవియు, అచ్చట - ఇచ్చట - అట మొదలగు స్థలముల దెలుపునవి.
3. కేలు - ఇరులు మొదలగు కొన్ని పదములును, ప్రత్తి - దూది మొదలగు సస్య వాచకములు.
4. నలుపు - తెలుపు - పసుపు - మొదలగు రంగుల తెల్పునవి.
5. సరి - సాన - ఈడు - జోడు - ఎన - ఉద్ది - దీటు మొదలగు సమానార్థకములు.
6. నూనె - నేయి - చమురు - కర్పూరము - బెల్లము మొదలగు రసవాచకములు.
7. బియ్యము - జీలకఱ్ఱ - మొదలగు ధాన్య వాచకములును - పసుపు - ఉప్పు - చింతపండు పులుసు మొదలగు సంభార వాచకములును నిత్యైక వచనములు.

# నిత్య బహువచనములు

1. వడ్లు - పెసలు - కందులు - మినుములు - సెనగలు - జొన్నలు మొదలగు ధాన్య వాచకములు.

2. దాగుడు మూతలు - అచ్చనగాయలు - ఓమన గుంటలు - చల్లుడు పిచ్చెలు - గుజ్జెన గూళ్లు - గొబ్బిళ్లు - మొదలగు క్రీడా వాచకములు.

3. ఇద్దరు - ముగ్గురు - పలువురు - అందరు - ఇందరు - ఎందరు - కొందరు మొదలగు సంఖ్యేయార్థకములు.

4. గుగ్గిళ్లు - ఖురులు - పులకలు - పేలాలు - బొరుగులు - మనము (మీరు + మేము) మొదలగునవి నిత్య బహు వచనములు.

## విభక్తుల ప్రయోగము

తృతీయ యందు చేత - చే ప్రత్యయములకు 'చేసి' అను అవ్యయమును, తోడ - తో ప్రత్యయములకు మై - మేలు అను అవ్యయమును వచ్చుట కలదు.

1. దానం చేసినా కార్యంబయ్యె.
   అతని సాయముంజేసి బ్రతుకగలిగితి.
   రయముమై జనుదెంచె శ్రద్ధమై వినిరి.

2. చతుర్థీ ప్రత్యయమునకు పొంటె అను అవ్యయము వచ్చుట కలదు. జగముల రక్షించు పొంటె రాముడవతరించె.

3. పంచమి యందు వలనకు నుండి ఎడ - కొలె - పోక అవ్యయములును, కంటెకు కన్న అవ్యయమును వచ్చును. నీ నుండి బ్రదికితి. దొంగల యెడ భయము - అతని కన్న ఇతడు పెద్ద మొ..నవి. ఈ ఉండికి - కొలె కొలె అవ్యయములు వచ్చును. నాటి నుండి - నాటగొలె - నాటగోలె మొ..నవి.

4. షష్ఠి యందు సంబంధార్థమున - నీ - నా - తన - లకు - దు ప్రత్యయము వచ్చుట గలదు. నీపని - నీదు పని - నాదు పుస్తకము.

5. స్త్రీల సంబోధించునప్పుడు రా - రో - ప్రత్యయములు వచ్చుట గలదు.
అక్కరా - చెల్లిరో - అమ్మరో!

6. కొన్ని చోట్ల ఒక విభక్తికి మరియొక విభక్తి వచ్చుట గలదు.

1. ద్వితీయకు ప్రథమ — అతడు రథమెక్కెను. ఆమె సొమ్ములు దాల్చెను.
2. తృతీయకు ద్వితీయ — కత్తిం గొమ్మను నరికె
3. సప్తమికి ద్వితీయ — కుండను నీరున్నది
4. సప్తమికి ప్రథమ — వాడు నేడు పోయె, తీర్థమాడితిమి.
5. పంచమికి తృతీయ — పాపులు బీదలచే లంచము గొందురు
6. ద్వితీయకు చతుర్థి — వర్షము కొఱకు జపము.
7. ప్రథమకు షష్ఠి — నా చేసిన పని
8. చతుర్థికి షష్ఠి — రామునకు వందనము
9. పంచమికి షష్ఠి — రాముడు భరతునకు పెద్ద
10. సప్తమికి షష్ఠి — కుండలో నీరున్నది.

## (2) సర్వ నామములు - Pronouns

ఇవి ఆరు విధములు.

నామవాచకములకు బదులుగా వాడబడునవి సర్వనామములు. ఇవి ఆరు విధములు.

1. పురుష బోధక సర్వనామములు (Personal Pronouns): ఉత్తమ - మధ్యమ - ప్రథమ పురుషులకు సంబంధించినవి.

   ఉదా: నీవు - అతడు - ఆమె - నేను. మొదలైనవి.

2. ప్రశ్నావాచక సర్వనామములు (Interogative Pronouns): ఎవరు ? ఏది ? ఎందరు ? మొదలగునవి.

3. సంబంధ సర్వనామములు (Relative Pronouns): వాక్యమందలి ఒక పదమునకు మరి యొక పదమునకు గల సంబంధమును గూర్చి తెలియజేయునవి. ఏ - ఆ - అనుపదములు నిత్య సంబంధము కలవియై యొక వ్యక్తిని బోధించుచుండును. ఇట్టి సంబంధముగల సర్వనామములను సంబంధ సర్వనామములందురు.

   ఉదా: ఎవడు - ఎవతె - ఏది - ఎందఱు - ఎంత - ఎన్ని - ఎవరు మొదలగునవి.

   1. ఎవడు చదువు చెప్పునో వాడు గురుడు.
   2. ఎవతె పాలిచ్చి పెంచునో ఆమెయె తల్లి.
   3. ఏది యశంబు నోడ గూర్చునో దానినే చేయుము.
   4. ఎందరు వచ్చిరో అందరును కానుక లిచ్చిరి.

4. నిర్దిష్ట సర్వనామము (Defenite Pronoun): సంబంధించిన విషయమును నిర్దేశించి తెలియ జేయునది.

   ఉదా: ఆ బాలుడు - ఈ బాలిక.

5. అనిర్దిష్ట సర్వనామములు (Indifenite Pronoun): సంబంధించిన విషయము నిర్దేశించి చెప్పలేనివి.

   ఉదా: అవి - ఇవి - అన్ని - కొన్ని - ఎన్ని

6. సంఖ్యా వాచక సర్వనామములు.
   ఉదా: పది - నూఱు - వేయి మున్నగునవి.

## (3) విశేషణములు (Adjectives)

విశేష్యము యొక్క గుణమును తెల్పునవి విశేషణములు. ఇవి ఐదు విధములు.

I. నామవిశేషణములు, II. విధేయ విశేషణములు, III. క్రియా విశేషణములు, IV. క్రియా జన్య విశేషణములు, V. క్రియా ప్రయుక్త విశేషణములు.

I. విశేష్యము గుణాదులు తెల్పునవి నామ విశేషణములు. ఇవి 5 విధములు.
   (1) గుణవాచకములు. (2) గుణప్రయుక్త విశేషణములు. (3) జాతి ప్రయుక్త విశేషణములు. (4) సంజ్ఞా ప్రయుక్త విశేషణములు. (5) ద్రవ్య ప్రయుక్త విశేషణములు.

నామవాచకముల గుణమును తెల్పునవి,

1. **గుణవాచకములు.:** తెల్లతామర - నల్లగలువ
   ఇట తెల్ల - నల్లని అనునవి - తామర - కలువల గుణమును తెల్పునవి.
2. గుణవాచకములకు తచ్ఛబ్దమును చేర్చుట వలన **గుణప్రయుక్త విశేషణములేర్పడును.** వాడు - వారు - అది - అవి తచ్ఛబ్దములు.
   **ఉదా:** మన్మథుడు చక్కని వాడు.
   శ్రీరాముడు నల్లని వాడు. ఇట మన్మథుడు - శ్రీరాముడు అను శబ్దములకు చక్కనివాడు, నల్లనివాడు

అను పద విశేషణములైనవి. ఇవి చక్క - నల్ల అను గుణవాచకములకు వాడు అను తచ్ఛబ్దము చేర్చుట వలన నేర్పడినవి. కావున చక్కనివాడు - నల్లనివాడు అనునవి గుణప్రయుక్త విశేషణములు.

3. జాతిని చెప్పు విశేషణములను జాతి ప్రయుక్త విశేషణములందురు.

**ఉదా :** పరుశురాముడు బ్రాహ్మణుడు - శ్రీరాముడు క్షత్రియుడు. ఇట పరశురాముడు - శ్రీరాముడు అను శబ్దములకు బ్రాహ్మణుడు - క్షత్రియుడు విశేషణములయినవి.

4. విశేషణమువలె వారి పేరులను సుజ్ఞా ప్రయుక్త విశేషణమందురు.

**ఉదా :** వాడు ధృతరాష్ట్రుడు.
వీడు సుయోధనుడు.
ఆమె ద్రౌపది.
ఇది కృష్ణానది.

ఇందు - ధృతరాష్ట్రుడు - సుయోధనుడు - ద్రౌపది - కృష్ణానది అనునవి సంజ్ఞా వాచకములు. వానికి పూర్వమునందున్న వాడు - వీడు - ఆమె - ఇది - అనువానికి క్రమముగా విశేషణములగుచున్నవి. కావున వీనిని సంజ్ఞాప్రయుక్త విశేషణములందురు.

5. ద్రవ్య వాచకములకు మతుబాదులు చేర్చుటవలన ద్రవ్య ప్రయుక్త విశేషణము లేర్పడును.

**ఉదా :** కుబేరుడు ధనవంతుడు.
భీముడు బలవంతుడు

ఇట ధనవంతుడు - బలవంతుడు అనునవి

వానికి పూర్వమందున్న కుబేరుడు - భీముడు అను శబ్దములకు విశేషణములు. ఇవి ద్రవ్యవాచకములయిన ధన - బల అనుశబ్దములకు మతుబాదులు చేర్చుట వలన నేర్పడినవి. కాననివి ద్రవ్యప్రయుక్త విశేషణములు.

II. **విధేయ విశేషములు :** విశేష్యమును ముందు చెప్పి, విశేషణ మును తరువాత చెప్పినచో అవిశేషణమును విధేయ విశేషమందురు.

**ఉదా :** రాముడు శూరుడు. లక్ష్మణుడు వీరుడు. బృహస్పతి బుద్ధిమంతుడు. ఇట శూరుడు, వీరుడు, బుద్ధిమంతుడు అను విశేషణములు. వాని విశేష్యములగు రాముడు - లక్ష్మణుడు - బృహస్పతి అనుశబ్దములకు తరువాత ప్రయుక్తములయినవి. అందువల్లనివి విధేయ విశేషణములు.

III. **క్రియా విశేషణములు :** క్రియల యొక్క గుణమును తెలుపునవి క్రియావిశేషణములు. గుణనామంబులకు చివర కాన్ - కన్ - అను వానిని చేర్చుట వలన ఈ క్రియావిశేషణము లేర్పడును.

**ఉదా :** వడిగా పరుగెత్తెను.

బిగ్గరగా అరచెను - ఇందు వడిగా, బిగ్గరగా అనునవి - పరుగెత్తెను - అరచెను అను క్రియలకు విశేషణములు.

IV. **క్రియాజన్య విశేషణములు :** ధాతువులనుండి పుట్టిన విశేష ణములు క్రియాజన్య విశేషణములు.

**ఉదా :-** చదువుచున్న బాలుడు
చదివిన పుస్తకము
చదువగల బాలుడు
చదువని బాలుడు

చదువు బాలుడు

చదివెడు బాలుడు

చదివెడి బాలుడు

ఇందు చదువుచున్న - చదివిన - చదువగల - చదువని - చదువు- చదివెడు - చదివెడి అనునేడును చదువు ధాతువు నుండి పుట్టిన విశేషణములు. ఇట్లే ప్రతి ధాతువు నుండి ఏడేసి విశేషణములు పుట్టును.

V. క్రియాజన్య విశేషణములకు తచ్ఛబ్దమును చేర్చుటవలన క్రియాప్రయుక్త విశేషణము లేర్పడును.

ఉదా:- వచ్చినవాడు ఫల్గుణుడు.
ఆడుచున్నవాడు పుష్కరుడు.
దుమికెడివాడుత్తరుడు.

ఇందు వచ్చినవాడు - ఆడుచున్నవాడు - దుమికెడివాడు - అనునవి క్రియాప్రయుక్త విశేషణములు.

## 4. అవ్యయములు

లింగ, వచన, విభక్తులు లేని పదములు అవ్యయములు. ఇవి ప్రతిపదోక్తములు, లాక్షణికములు అని రెండు విధములు.

స్వతస్సిద్ధములైన అవ్యయములను ప్రతి పదోక్తములందురు.

అవి:-

అంతటన్ - అదిగోన్ - అందులకున్ - ఇందున్ - ఇదిగోన్ - ఇందులకున్ - ఎందులకున్ - ఎట్టకేలకున్ - కదున్, కాబోలున్ - కాపుతన్ - కావునన్ - క్రచ్చరన్,

గ్రక్కునన్ - చయ్యనన్ - తటాలునన్ - తెప్పునన్ - తోడుతన్, తోడ్తోన్ - దాకన్ - దబ్బునన్ - ఫక్కునన్ - పెందలకడన్ - బొత్తిగన్ - మెట్టుకున్ - వలెన్ - వెంబడిన్ - సారెకున్ - అక్కటా, అయ్యో - ఆహా - ఊరక - ఓహో - ఔర - కదా - ఇంచుక - కొంచెము - ఇసుమంత - గోరంత - మడి - పదవడి - ఒకొ - అప్పుడు - ఇప్పుడు - ఎప్పుడు - రకము - అట్లు - ఇట్లు - ఎట్లు - కట్టా - కటకటా - ఏమి - ఏల - ఛీ - తలా - కరము - మునుకొని - హో - హోరాహోరి - కాని - కాబట్టి - మిక్కిలి - యు - ను - అను సముచ్ఛయములు.

ధాతువులనుండి పుట్టిన అవ్యయములను లాక్షణికావ్యయ ములందురు.

1) క్త్వార్థక (2) వ్యతిరేకక్త్వార్థక (3) శత్రర్థక (4) తుమర్థక (5) అనంతర్యార్థక (6) చేదర్థక రూపములను లాక్షణికావ్యయము లందురు. అవి

| | | |
|---|---|---|
| చదివి | - | క్త్వార్థకము |
| చదువక | - | వ్యతిరేకక్త్వార్థకము |
| చదువుచున్ | - | శత్రర్థకము |
| చదివింపన్ | - | తుమర్థకము |
| చదివించుడున్ | - | అనంతర్యార్థకము |
| చదివించినన్ | - | చేదర్థకము. |

ఇవి చదువు అనుధాతువు నుండి పుట్టిన లాక్షణికావ్య ములు.

# 5. క్రియలు

పనులను దెలుపు పదములను ధాతువు లందురు. ధాతువులు సాధారణముగా ఉకారాంతములైయుండును.

సకర్మకములు - అకర్మకములు అని ధాతువులు రెండు రకములు.

కర్మలనపేక్షించునవి సకర్మకములు. కర్మల అపేక్షింపనివి అకర్మకములు.

**సకర్మకధాతువులు :-** ఇచ్చు - ఎఱుగు - కప్పు - కొట్టు - కోయు - గ్రుచ్చు - చేయు - తలచు - తిను - తీయు - తెరచు - నోచు - పఠించు - పలుకు - పెట్టు - పోలు - భుజించు - మ్రింగు - వండు - వ్రాయు మొదలైనవి.

**అకర్మకధాతువులు :-** అగు - అణగు - అలుగు - ఉండు - ఉదయించు - ఎదుగు - కాగు - కురియు - కూలు - చను - చీలు - చెడు - తిరుగు - నడుచు - నవ్వు - నిద్రించు - పడు - పెరుగు - మునుగు - మొలచు - వచ్చు మొదలగునవి.

డు-రు, వు-రు, ను-ము, అను క్రియా విభక్తులతో కూడిన ధాతువులను క్రియలందురు.

భాషను బట్టి తత్సమక్రియలు - దేశ్యక్రియలు అని రెండు రకములు.

సంస్కృత పదములకు - ఇంచు చేర్పగా నేర్పడునవి

తత్సమక్రియలు. ఉదా: కోపించు - స్రవించు - తపించు - వచించు - జయించు - భుజించు - భాగించు - మొదలైనవి.

**అచ్చ తెలుగువి దేశ్య క్రియలు:**

వచ్చు - పోవు - చదువు - తిను మొదలైనవి.

**ఉపయోగమును బట్టి సహాయ క్రియలు - స్వతంత్ర క్రియలు - న్యూనక్రియలు** అని క్రియలు మూడు రకములు.

కాలము మున్నగువాని నేర్పరుచుట యందు ఇతర క్రియలకు సాయపడునవి సహాయక్రియలు. వీనినే ఉప క్రియలందురు. ఇవి తెలుగున నాలుగు.

ఉండు - కలుగు - పడు - కొను అనునవి.

ఉండు - వచ్చియుండును, వచ్చియున్నాడు.

కలుగు - చదువకలిగెను, రాగలడు.

కొను - చదువుకొంటిని, వేడుకొందును.

పడు - భయపడెను, చేయబడును.

వీనికి స్వతంత్ర ప్రయోగము కూడ కలదు.

స్వతంత్రముగా ఉపయోగింపబడునవి స్వతంత్రక్రియలు. అవి: పోషించు - భుజించు - వచ్చు - పోవు మొదలైనవి.

కొన్ని కాలములందును - పురుషములందును మాత్రము ప్రయోగింపబడునవి **న్యూనక్రియలు**. ఇవి

ఒల్లడు - వలయును - వలదు - కూడును - కూడదు - తగును - తగదు - మొదలైనవి.

కొన్ని ధాతువులకును - నామములకును సహాయక్రి

యలు నాలుగు కాకా తక్కిన ధాతువులు కొన్ని చేరి అర్థ భేదము కలిగించును. అవి శబ్దపల్లములు. నిలుచుండు - కూరుచుండు - చొప్పడు - ఆకొను - ఈకొను - అలవడు - ఏరుపడు - తలపోయు - విజయంచేయు - పరుండు - మేలుకొను మొదలైనవి.

కార్యమును బట్టి సమాపక క్రియలు - అసమాపక క్రియలు అని రెండు రకములు.

సంపూర్ణాభిప్రాయమును దెల్పునవి సమాపకక్రియలు.

కృష్ణార్జునులు ఖాండవ వనమును దహింపజేయించిరి - ఇట చేయించిరి అనునది సమాపకక్రియ.

సంపూర్ణాభిప్రాయమును తెలుపనివి అసమాపకక్రియలు.

కృష్ణార్జునులు అగ్నిదేవునికి సహాయపడి, ఖాండవ వనము దహనము చేయించిరి. ఇటు సహాయపడి - అనునది అసమాపకక్రియ.

ప్రతి ధాతువునకు నాలుగేసి కాలములు. - మూడేసి పురుషములు - రెండేసి వచనములుండును.

జరుగుచున్న కాలబోధకము వర్తమానకాలము

| | ఏ | - | బ |
|---|---|---|---|
| ప్ర | - చదువుచున్నాడు | | - చదువుచున్నారు. |
| | చదువుచున్నది | | - చదువుచున్నవి. |
| మ | - చదువుచున్నావు | | - చదువుచున్నారు |
| ఉ | - చదువుచున్నాను | | - చదువుచున్నాము. |

జరిగి పోయిన కాలము భూతకాలము

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర | - చదివెను | - చదివిరి. |
| మ | - చదివితివి<br>చదివితి | - చదివితిరి |
| ఉ | - చదివితిని | - చదివితిమి. |

జరుగబోవు కాలము భవిష్యత్కాలము

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర | - చదువుగలదు | - చదువగలరు |
| | చదువగలదు | - చదువగలరు |
| మ | - చదువగలవు | - చదువగలరు. |
| ఉ | - చదువగలను | - చదువగలము. |

వస్తువులయొక్క సహజధర్మము స్వభావాదులదెల్పునది తద్ధర్మ కాలము.

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర | - చదువును | - చదువుదురు |
| | (వారు) | |
| | చదివెడును | - చదివెదరు |
| | (అవి) | |
| | చదివెడిని | - చదువును<br>చదివెడును<br>చదివెడివి |
| మ | - చదువుదువు | - చదువుదురు |
| | చదివెదవు | - చదివెదరు |

ఉ - చదువుదును - చదువుదుము
చదివెదను - చదివెదము

ఈ నాలుగు కాలములుగాక:-

1. ప్రార్థనాద్యర్థకము
2. ఉభయ కర్తృక ప్రార్థనాద్యర్థకము
3. వ్యతిరేకార్థకము
4. వ్యతిరేకప్రార్థనాద్యర్థకము
5. ఆశీరర్థకము అనునైదు భాగములు కూడ కలవు.

1. ప్రార్థనాద్యర్థకమునకు మధ్యమ పురుషరూపంబులు మాత్ర ముండును.

ఏ ; బ

మధ్యమ - చదువుము - చదువుడు.

2. ఉభయ కర్తృక ప్రార్థనాద్యర్థకమునకు ఉత్తమపురుష బహువచనము మాత్రముండును.
ఉదా : - ఏ. - బ. చదువుము.

3. **వ్యతిరేకార్థకము :**

ప్ర - చదువడు - చదువరు
చదువదు - చదువవు
మ - చదువవు - చదువరు
ఉ - చదువను - చదువము

4. **వ్యతిరేక ప్రార్థనాద్యర్థకము :**

మ - చదువకుము - చదువకుడు. ఇవి గాక ప్రతిధాతువు నుండి రెండు విశేష్యములు - ఆరు అవ్యయములు - ఏడు క్రియాజన్య విశేషములు కలుగుచున్నవి.

5. ఆశీరర్థకమున మధ్యమపురుష రూపంబులు మాత్రముం డును. (ఇవి ఏకవచన బహువచనంబులు రెండింట నొకే రూపములు కలిగియుండును).

మ - చదివెదును - చదువుతాను

రెండు విశేష్యములు:

1. భావార్థకము: చదువుట
2. వ్యతిరేకభావార్థకము: చదువమి.

ఆరు అవ్యయములు:-

1. క్త్వార్థకము: చదివి
2. వ్యతిరేకక్త్వార్థకము: చదువక
3. శత్రర్థకము: చదువుచున్
4. తుమర్థకము: చదువన్ - చదువగాన్ - చదువంగాన్ - చదువగన్ - చదువంగన్.
5. అనంతర్యార్థకము: చదువుడున్
6. చేదర్థకము: చదివినన్

క్రియాజన్య విశ్లేషణములు ఏడు:

1. చదువుచున్న బాలుడు
2. చదివిన పుస్తకము
3. చదువగల బాలుడు
4. చదువని బాలుడు
5. చదువు బాలుడు
6. చదివెడు బాలుడు
7. చదివెడి బాలుడు

ధాతువులకు చివర నాయా పురుషంబులందు వచ్చు క్రియా విభక్తులు.

| | ఏ | బ |
|---|---|---|
| ప్ర | డు | రు |
| మ | వు | రు |
| ఉ | ను | ము |

తనంతట తాను చేయుట అప్రేరణము. ఇతరులచే చేయుట ప్రేరణము. ప్రేరణమున ధాతువునకు ఇంచు అను దానిని చేర్తురు.

అప్రేరణము: రాముడు పాఠము చదువుచున్నాడు. ఇట రాముడు పాఠమును తనంతట తానే చదువుచున్నాడు. కావున చదువు
చున్నాడు అను దానిని చదువు ధాతువు యొక్క అప్రేరణ రూపమందురు. లేక స్వార్థకరూపమందురు.

ప్రేరణము: రాముడు పాఠమును చదివించుచున్నాడు. ఇట రాముడి ఇతరుని పాఠము చదువునట్లొనర్చుచున్నాడు. కావున చదివించు
చున్నాడు అను దానిని చదువు ధాతువు యొక్క ప్రేరణ రూపమందురు. తక్కిన ధాతువులిట్లే గ్రహించునది.

విద్యార్థుల ఉపయోగార్థము చదువు ధాతువుయొక్క రూపము లిట చూపుచున్నాము.

## చదువు ధాతువు సకర్మకము (Transitue)

### 1. కర్త్రర్థకము (Active voice)

#### వర్తమానకాలము (Present tense)

| | ఏ | బ |
|---|---|---|
| ప్ర: | చదువుచున్నాడు | - చదువుచున్నారు. |
| | చదువుచున్నది | - చదువుచున్నవి. |

| | | |
|---|---|---|
| మ : | చదువుచున్నావు | - చదువుచున్నారు |
| ఉ : | చదువుచున్నాను | - చదువుచున్నాము. |

### 2. భూతకాలము (Past tense)

| | ఏ | - బ |
|---|---|---|
| ప్ర : | చదివెను | - చదివిరి |
| మ : | చదివితివి | - చదివితిరి |
| ఉ : | చదివితిని | - చదివితిమి |

### 3. భవిష్యత్కాలము (Future tense)

| | ఏ | - బ |
|---|---|---|
| ప్ర : | చదువగలడు | - చదువగలరు |
| | చదువగలదు | - చదువగలవు. |
| మ : | చదువగలవు | - చదువ గలరు |
| ఉ : | చదువగలను | - చదువగలము |

### 4. తద్ధర్మకాలము (Aorist)

| | ఏ | - బ |
|---|---|---|
| ప్ర : | చదువును | - చదువుదురు (వారు) |
| | చదివెదును | - చదివెదరు |
| | చదివెడిని | - చదువును (అవి) |
| | | చదివెదును |
| | | చదివెడిని |
| మ : | చదువుదువు | - చదువుదురు. |
| | చదివెదవు | - చదివెదరు |
| ఉ : | చదువుదును | - చదువుదుము |
| | చదివెదను | - చదివెదము |

### 5. ప్రార్థనాద్యర్థకము

| | ఏ | - బ |
|---|---|---|
| మ : | చదువుము | - చదువుడు |

### 6. ఉభయకర్తృక ప్రార్థనాద్యర్థకము

| | ఏ | - బ |
|---|---|---|
| ఉ : | ———— | - చదువుదము. |

### 7. వ్యతిరేకార్థకము

| | ఏ | - బ |
|---|---|---|
| ప్ర : | చదువడు | - చదువరు |
| | చదువదు | - చదువవు |
| మ : | చదువవు | - చదువరు |
| ఉ : | చదువను | - చదువము. |

### 8. వ్యతిరేక ప్రార్థనాద్యర్థకము

| | ఏ | - బ |
|---|---|---|
| మ : | చదువకుము | - చదువకుడు |

### 9. ఆశీరాద్యర్థకము

| | ఏ | - బ |
|---|---|---|
| మ : | చదివెదును | - చదువుతాను |

ఈ తొమ్మిదియు సమాపక క్రియారూపములు.

1. భావార్థకము. చదువుట
2. వ్యతిరేక భావార్థకము. చదువమి

ఇవి విశేష్యములు.

3. క్త్వార్థకము. చదివి
4. వ్యతిరేక క్త్వార్థకము. చదువక
5. శత్రర్థకము. చదువుచున్
6. తుమర్థకము. చదువన్-చదువగాన్ చదువంగాన్-చదువగన్-చదువంగన్
7. అనంతర్యార్థకము. చదువుడున్
8. చేదర్థకము. చదివినన్.

ఇవి లాక్షిణక అవ్యయములు. వీనిని అస మాపక క్రియ లని కూడ అందురు.

9. వర్తమానార్థక విశేషణము. చదువుచున్న
10. భూతార్థక విశేషణము. చదివిన
11. భవిష్యదర్థక విశేషణము. చదువగల

ఇవి క్రియా జన్య విశే షణములు.

12. తద్ధర్మార్థక విశేషణములు. చదువు - చదివెడు - చదివెడి
13. వ్యతిరేకార్థక విశేషణము- చదువని.

# కర్మార్థకము (Passive Voice)

## 1. వర్తమాన కాలము

| | ఏ | బ |
|---|---|---|
| ప్ర: | చదువబడుచున్నాడు | - చదువబడుచున్నారు. |
| | చదువబడుచున్నది | - చదువబడుచున్నవి. |
| మ: | చదువబడుచున్నావు | - చదువబడుచున్నారు. |
| ఉ: | చదువబడుచున్నాను | - చదువబడుచున్నాము. |

## 2. భూతకాలము

| | ఏ | బ |
|---|---|---|
| ప్ర: | చదువబడియెను<br>చదువబడెను | - చదువబడిరి |

| | | |
|---|---|---|
| మ : | చదువబడితివి<br>చదువబడితి | - చదువబడితిరి |
| ఉ : | చదువబడితిని | - చదువబడితిమి |

## 3. భవిష్యత్కాలము

| | ఏ | - బ |
|---|---|---|
| ప్ర : | చదువభడ గలడు | - చదువబడగలరు |
| | చదువబడ గలదు | - చదువబడగలవు |
| మ : | చదువబడ గలవు | - చదువబడగలరు |
| ఉ : | చదువబడగలను | - చదువబడగలము |

## 4. తద్ధర్మార్థకము

| | ఏ | - బ |
|---|---|---|
| ప్ర : | చదువబడును | - చదువబడుదురు (వారు) |
| | చదువబడియెడును | - చదువబడియెదరు |
| | చదువబడెడును | - చదువబడెదరు |
| | చదువబడియెడిని | - చదువబడును (అవి) |
| | చదువ బడెడిని | - చదువబడి యెడును<br>చదువబడెడును<br>చదువబడియెడిని<br>చదువబడెడిని |
| మ : | చదువబడుదువు<br>చదువబడుదు | - చదువబడుదురు |
| | చదువబడియెదవు<br>చదువబడిదవు | - చదువబడియెదరు |

చదువబడియెదు - చదువబడెదరు
చదువుబడెదు

| | | |
|---|---|---|
| ఉ: | చదువబడుదును | - చదువబడుదుము |
| | చదువబడియెదను | - చదువబడియెదము |
| | చదువబడెదను | - చదువబడెదము. |

## 5. ప్రార్థనాద్యర్థకము

| | | |
|---|---|---|
| | ఏ | - బ |
| మ: | చదువబడుము | - చదువబడుడు |

## 6. ఉభయ కర్తృక ప్రార్థనాధ్యర్థము

| | |
|---|---|
| ఏ | - బ |
| — | చదువబడుదము |

## 7. వ్యతిరేకార్థకము

| | | |
|---|---|---|
| ప్ర: | చదువబడడు. | - చదువబడరు |
| | చదువబడదు | - చదువబడవు |
| మ: | చదువబడవు | - చదువబడరు |
| ఉ: | చదువబడను. | - చదువబడము |

## 8. వ్యతిరేక ప్రార్థనాధ్యర్థకము

| | | |
|---|---|---|
| మ: | చదువబడకుము | - చదువబడకుడు |

## 9. ఆశీరాధ్యర్థకము

| | | |
|---|---|---|
| మ: | చదువబడియెదును | - చదువబడెదును |
| | | చదువబడుతను |

1. భావార్థకము - చదువబడుట
2. వ్యతిరేక భావార్థకము-చదువబడమి
3. క్త్వార్థకము - చదువబడి
4. వ్యతిరేక క్త్వార్థకము - చదువబడక
5. చేత్రర్థకము - చదువబడుచున్
6. తుమర్థకము - చదువబడన్ - చదువబడగాన్ - చదువబడంగాన్ - చదువబడగన్ - చదువబడంగన్

ఇవి విశేష్యములు ఇవి లాక్షణిక అవ్యయములు. వీనిని అసమాపక క్రియలని కూడా అందురు

7. అనంతర్యార్థకము - చదువబడుడున్
8. చేదరర్థకము - చదువబడ్డన్ - చదువబడినన్
9. వర్తమానార్థక విశేషణము - చదువబడుచున్న
10. భూతర్థక విశేషణము - చదువబడిన చదువబడ్డ
11. భవిష్యదర్థక విశేషణము - చదువబడు - చదువబడియెడు - చదువబడెడు - చదువబడియెడి - చదువబడెడి.
12. వ్యతిరేకార్థక విశేషణము - చదువబడని

ఇవి క్రియాజన్య విశేషణములు

## వాక్యపరిచ్ఛేదము

1. అభిప్రాయము పూర్తిగా తెల్పు పద సముదాయము వాక్యము.

   శ్రీరాముడు సీతను వివాహమాడెను.

2. ఆకాంక్ష యోగ్యతాసన్నిధులభిప్రాయ బోధకములు.

   **ఆకాంక్ష:** అనగా, పదముల పరస్పర సంబంధము.

   శ్రీరాముడు సీతను - అనినంతనే ఏమిచేసెనను ప్రశ్నఉత్పన్నమగును. వివాహమాడెనని ఉత్తరము - ఇది ఆకాంక్ష.

యోగ్యత: అనగా అర్థము సరిగా కుదురుట. నీళ్లతో కాల్చుచున్నాడు. ఇందు ఆకాంక్ష యున్నను యోగ్యత లేదు. నీళ్లతో కాల్చుట అసంభవము.

సన్నిధి: అనగా మాటలు వెంట వెంట పలుకుట. నేడు రాముడు అని - రేపు సీతను అని, ఎల్లుండి వివాహమాడెను - అన్న అభిప్రాయము బోధపడదు.

3. ఏక వాక్యము నందొకానొకడు తప్ప సర్వపదములు క్రియ నిరపేక్షములై యుండవచ్చును.
శ్రీరాముడు సీతను వివాహమాడెను.
సీతను శ్రీరామడు వివాహమాడెను.
రావణుడు సీతనపహరించెను.
సీతను రావణుడపహరించెను.
అని యిట్లు కర్తగాని కర్మగాని మొదట ఉండునట్లు వ్రాయవచ్చును.

4. కొండొకచో వాక్యము వాక్యాంతర గర్భితమగు
ఇచ్చుట కెంతకాలమయ్యె మీరు, రారేల? ఎంతకాలమయ్యె నిచ్చుటకి మీరు రారేల? అని అర్థము.

5. వాక్యసముదాయము కావ్యము. శ్రీరాముడు సీతను వివాహమాడెను. తండ్రి యాజ్ఞచే నడవికేగెను. సీతను రావణుడపహరించెను. రాముడు రావణుని వధించి, సీతను విడిపించెను. ఇట్లు పరస్పర సంబంధముండునట్లు రచించబడిన వాక్య సముదాయము కావ్యము.

6. కావ్యము గద్యకావ్యము, పద్యకావ్యము, చంపూ కావ్యములని మూడు విధములు. వచనము విస్తారముగా గలది గద్యకావ్యము. కేవలం పద్యములతో కూడినది పద్య కావ్యము. గద్యపద్యములతో కూడినది చంపు కావ్యము.

7. ప్రాతిపదికము లెల్ల ప్రథమాంతములు. నామవాచకములు ప్రథమాంతములుగా ఉండును.

రాముడు - కుక్క - పిల్లలు - చీమలు మొదలైనవి.

8. ప్రధానమునకు ప్రథమా విభక్తియగును.

శ్రీరాముడు రావణుని సంహరించెను.

దొంగలు ధనమును అపహరించిరి.

దేవదత్తుడు చెట్లను పెంచెను.

ఇందు - శ్రీరాముడు - దొంగలు - దేవదత్తుడు - ప్రధానమైనవి. ఇవి ప్రథమా విభక్తి యందుండును.

9. అప్రధానమనకు చే - చేతలగును.

రావణుడు సంహరింపబడెను.

ధనము అపహరింపబడెను.

చెట్లు పెంపబడును. ఈ వాక్యము లందు కర్మలు ప్రధానములు. కర్త అప్రధానము. కర్తృవాచకములగు రామ - దొంగ, దేవదత్త శబ్దములకు చే - చేతలువచ్చి - రామునిచే - దొంగలచే - దేవదత్తునిచే అని యగును.

10. అప్రధాన కర్మకు ని -ను లగు

శ్రీరాముడు సంహరించెను.

దొంగలపహరించిరి.

దేవదత్తుడు పెంచెను. ఈ వాక్యములలో కర్తలు ప్రధానమైనవి. కర్మలైన రావణుడు - చెట్టు - ధనశబ్దములు అప్రధానములు. వీనికి ని-ను లు చేరును.

శ్రీరాముడు రావణుని సంహరించెను.

దొంగలు ధనమునపహరించిరి.

దేవదత్తుడు చెట్లను పెంచెను.

11. జడ. పదంబుల ద్వితీయకు ప్రథమ యగు.
ధనము - చెట్టు - జడవాచకములు. వాని ద్వితీయకు ప్రథమ వచ్చి - దొంగలు ధనమపహరించిరి - దేవదత్తుడు చెట్లు పెంచెను - అని కాని లేక వెనుకటివలె ని-ను లు చేర్చిగాని వాడనగును. రాముడు కుక్కను కొట్టెను అనుచోట కుక్క జడము కాదు. కాన రాముడు కుక్క కొట్టెను, అని కుక్క శబ్దమునకు ప్రథమ రాదు.

12. వచ్యార్థా ముఖ్య కర్మంబునకు - తో-తోడ కి-కు లు తరుచుగానగును. వచ్యర్థమనగా చెప్పుట - దాని ప్రధానకర్మకు ద్వితీయ యగును.
రావణునితో విభీషణుడు నీతులు చెప్పెను.
జానకికి త్రిజట స్వప్నమును దెల్పెను.
రావణుడు - జానకి - అముఖ్య కర్మలు.
నీతి - స్వప్నము - ముఖ్యకర్మలు.

13. కర్త ప్రధానమైన కర్త్రర్థక వాక్యము.
కర్మ ప్రధానమైన కర్మర్థకవాక్యము.
రాముడు సంహరించెను - కర్త ప్రధానము.
రావణుడు సంహరింపబడెను - కర్మ ప్రధానము.

14. ప్రధానమును బట్టి క్రియల లింగవచన పురుషములుండును.

| కర్త్రర్థక వాక్యము | - కర్మార్థకవాక్యము. |
|---|---|
| శ్రీకృష్ణుడు నన్ను రక్షించును | - శ్రీకృష్ణునిచే నేను రక్షింపబడుదును. |
| గురువు మమ్ము చదివించును | - గురునిచే మేము చదివింపబడుదుము. |
| నేను నిన్ను ప్రార్థింతును | - నీవు నాచే ప్రార్థింపబడుదువు. |
| మేము మిమ్ము పూజింతుము | - మాచే మీరు పూజింపబడుదురు. |

నీవు దుష్టులను దండింతువు- దుష్టులు నీచే దండింపబడుదురు.
మీరు కీడును చేయరు - కీడు మీచే చేయబడదు.

15. అకర్మక ధాతువులకు, అప్రేరణంబున కర్తయగునవి ప్రేరణంబున కర్మయగును.

**సామాన్య వాక్యము** - **ప్రేరణార్థక వాక్యము**
చెట్లు పెరిగెను - చెట్లను పెంచెను.
విల్లు విరిగెను - వింటిని విరిచెను.
హృదయము భేదిల్లెను - హృదయమును భేదించెను

16. గతి - బుద్ధి - ప్రత్యవసానార్థ శబ్దకర్మంబులకు అప్రేరణంబున కర్తయగునది ప్రేరణంబున కర్మయగును.

పోవు- పొందు - గత్యర్థకములు.
తెలియు - ఎరుగు - బుద్ధ్యర్థకములు.
తిను - మ్రింగు - ప్రత్యవసానార్ధకములు
విను - చదువు - చెప్పు - శబ్దకర్మములు.
రాముడింటికిపోయెను - తండ్రి రామునింటికి పంపెను.
నాకు మంచి తెలియును - మిత్రుడు నాకు మంచి తెల్పెను.
నేను చదివితిని - తండ్రి నన్ను చదివించెను.
నీవన్నియును తింటివి - తండ్రి నిన్ను అన్నమును తినిపించెను.

17. అప్రధాన కర్తకు ఒకానొకచో కి -కు లు బహుళముగా కాన్పించును.

ఇంద్రుడు తత్వమును దెలిపెను.
బ్రహ్మ ఇంద్రునకు తత్వమును దెలిపెను.
రాముడు మిధిలను జూచెను.
విశ్వామిత్రుడు రామునకు మిధిలను చూపించెను.

## ప్రశ్నలు

1) ఆంధ్ర భాషలో పదము లెన్ని రకములు? అవి యేవి?
2) తత్సమ - తద్భవము లేర్పడు విధమును వ్రాయుము.
3) భాషా భాగము లెన్ని? అవి యేవి?
4) నామవాచకము నందలి రకములు సోదాహరణముగా తెల్పుము.
5) సర్వనామము నందలి రకములు వివరింపుము.
6) విశేషణము లెన్ని రకములు? అవి యేవి? సోదాహరణముగా తెల్పుము?
7) అవ్యయములనగా నేమి? అవి ఎన్నిరకములు? సోదాహరణముగా తెల్పుము.
8) క్రియలనగానేమి? వాని భేదములు సోదాహరణముగా వివరింపుము.
9) వాక్యమున ఆకాంక్ష - యోగ్యత, సన్నిధి అనగానేమో తెల్పుము.

## 3. సంధి విభాగము

I. సంధి - **157 - 187**

**1.** ఆగమ సంధులు

**2.** ఆదేశ సంధులు

**3.** ఏకాదేశ సంధులు

## II. సంస్కృత సంధులు :

1) సవర్ణ దీర్ఘసంధి -
2) గుణసంధి -
3) వృద్ధి సంధి
4) యణాదేశ సంధి
5) అనునాశిక సంధి
6) జశ్త్వ సంధి
7) శ్చుత్వ సంధి
8) లాదేశ సంధి
9) విసర్గ సంధి

## III. తెలుగు సంధులు :

1) అకార సంధి
2) ఇకార సంధి
3) ఉకార సంధి
4) యడాగమ సంధి
5) టుగాగమ సంధి
6) పుంప్వాదేశ సంధి
7) సరళా దేశ సంధి
8) గసడదవా దేశ సంధి
9) రుగాగమ సంధి
10) దుగాగమ సంధి
11) ద్విరుక్త టకార సంధి
12) త్రికసంధి
13) ఆమ్రేడిత సంధి
14) నుగాగమ సంధి

15) ప్రాతాధి సంధి
16) పడ్వాదేశ సంధి
17) డువర్ణలోక సంధి
18) పోడ్యాదేశ సంధి
19) లు-ల-నల సంధి
20) అపదాది స్వరసంధి
21) అల్లోప సంధి
22) వకారలోప సంధి

## సంధి పరిచ్ఛేదము

వర్ణములకు గాని, శబ్దములకుగాని, వ్యవధానము లేకుండ, ఉచ్చారణ జరిగినపుడు కలుగు కలయిక సంధి అనబడును.

పూర్వపరస్వరంబులకు పరస్వరంబేకాదేశంబగుట సంధి యని సూత్రము. రాజు + అతడు - రాజులోని ఉకారము పూర్వస్వరము. అతడులోని అకారము పరస్వరము. కాన ఆ రెంటికి (ఉ+అ) మారుగ పరస్వరమైన, అకారము నిలిచినది. ఇచ్చట అవ్యహితమై, సంధి యేర్పడినది.

రాజు + అతడు = రాజతడు
ఆది + అమ్మ = ఆదమ్మ
పిచ్చి + అయ్య = పిచ్చయ్య
తాటి + ఆకు = తాటాకు మొదలైనవి.

ఈ సంధులందు వర్ణలోప - వర్ణాగమ - వర్ణాదేశాదులు

కల్గుచుండును. ఆంధ్ర భాష అజంతము కాన అచ్ సంధియే జరుగుచుండును. సంధి జరిగినపుడు ఒక వర్ణలోపము కల్గినచో వర్ణ లోపమందురు.

ప్రాత + ఇల్లు =ప్రాయిల్లు

యడాగమము రాగా - ప్రాయిల్లు అగును. ఇందు 'త' లోపించినది - యడాగమము వచ్చినది.

వర్ణమింకొకటి వచ్చి చేరుట వర్ణాగమము. సంధి లేని చోట వర్ణాగమము జరుగును. మా + ఇల్లు

మా + య్ + ఇల్లు - మాయిల్లు. ఒక వర్ణమునకు బదులు మరియొక వర్ణము వచ్చిచేరుట వర్ణాదేశము. కృష్ణుడు + పోయెను - కృష్ణుడు వోయెను.

పకార స్థానమున వకారము వచ్చినది. ఇది ఆదేశము.

సంధులను స్థూలముగా సంస్కృత సంధులు, తెలుగు సంధులు అని విభజింప వచ్చును. అక్షరముల మార్పును బట్టి కూడా సంధుల వర్గీకరించవచ్చును.

## 1. ఆగమ సంధులు

పూర్వపర పదములలోని ఏ వర్ణమును తొలగింప కుండా, మరి యొక వర్ణము మిత్రుని వలె వచ్చి చేరిన దానిని ఆగమసంధి అందురు.

**ఉదా:** నీ + కలము = నీదు కలము

నా + మాట = నాదు మాట

తన + ఫలము = తనదు ఫలము.

నీ + దు + కలము

నా + దు + మాట

తన + దు + ఫలము

రుగాగమ - టుగాగమ - నుగాగమ - దుగాగమ సంధులు ఈ కోవకు చెందినవి.

## 2. ఆదేశ సంధులు

సంధిలోని పూర్వపర పదముల మధ్య గల ఒక వర్ణమును తొలగించి, దాని స్థానమున మరియొక వర్ణము శత్రువు వలె వచ్చిచేరుట ఆదేశ సంధి.

అతి + అంతము =

అతి + య్ + అంతము = అత్యంతము

అత్ + ఇ + య్ + అంతము

యణా దేశ పుంప్వా దేశ సంధులు ఈ కోవకు చెందినవి.

## 3. ఏకాదేశ సంధులు

సంధిలోని పూర్వపర పదముల నడుమగల రెండు వర్ణములను తొలగించి, ఆ రెంటింటి స్థానమున ఒకే వర్ణము వచ్చి చేరిన దానిని **ఏకాదేశసంధి** అందురు.

దేవ + ఇంద్రుడు
దేవ్ + అ + ఇంద్రుడు
అ + ఇ = ఏ
దేవేంద్రుడు - గుణసంధి - సవర్ణ దీర్ఘసంధి - వృద్ధిసంధి ఈకోవకు చెందినవి.

## సంస్కృత సంధులు

**1. సవర్ణదీర్ఘ సంధి :**

అ - ఇ - ఉ - ఋ లకు సమానాచ్చులు పరమగునపుడు దాని దీర్ఘ మేకాదేశమగును. సవర్ణమనగా సమానమైన వర్ణము అని అర్థము. ఒక్కొక్క అక్షరమునకు ఒక్కొక్క కుటుంబము కలదు. ఈ అక్షరములు ఎన్నియో మార్పులనందు చుందును.

అక్షరములు హ్రస్వము - దీర్ఘము, ప్లుతము అని మూడు విధములు

మాత్ర ఒక క్షణకాలము.

ఒక మాత్రకాల ఉచ్చారణ కలది హ్రస్వము.
రెండు మాత్రల కాలము ఉచ్చారణ కలది దీర్ఘము.
మూడు మాత్రల కాలము ఉచ్చారణ కలది ప్లుతము.

ఒక్కొక్క అక్షరము మూడు విధముల ఉచ్చరింపబడును.
1. హ్రస్వము 2. దీర్ఘము 3. ప్లుతము.

I 1. హ్రస్వము : రామ + అనుజ = రామానుజ
2. హ్రస్వదీర్ఘము : రామ + ఆజ్ఞ = రామాజ్ఞ
3. హ్రస్వ ప్లుతము.

II. దీర్ఘ హ్రస్వము
దీర్ఘ దీర్ఘము
దీర్ఘ ప్లుతము

III. ప్లుత హ్రస్వము.
ప్లుత దీర్ఘము.
ప్లుత ప్లుతము

ఈ రీతిగ ఒక్కొక్క అక్షరము 3X3 = 9 విధముల రూపొందును. ఇట్లే ఇ కార ఉ కారములకు కూడా ఇన్ని రూపములుండును. ఇవి అన్నియు సవర్ణములు.

రామ + అనుజ = రామానుజ
రామ + ఆజ్ఞ = రామాజ్ఞ
కవి + ఇంద్ర = కవీంద్ర
ఋషి + ఈశ్వర = ఋషీశ్వర
గురు + ఉపదేశము = గురూపదేశము
చమూ + ఉదధి = చమూదధి
పితృ + ఋణము = పితౄణము
ఇవి ఏకాదేశ సంధులు.

**2) గుణ సంధి:**

ఏ - ఓ - అర్ - అను వర్ణములు గుణములు. వీని వలన నేర్పడిన సంధి గుణసంధి.
అకారమునకు ఇ - ఉ - ఋ లు పరమైన క్రమముగా ఏ - ఓ - అర్‌లు ఏకాదేశముగా వచ్చును.

అ + ఇ = ఏ
అ + ఉ = ఓ
అ + ఋ = అర్ ఏకాదేశములగును

ఉదా : సుర + ఇంద్ర = సురేంద్ర (అ + ఇ) = ఏ
రమా + ఈశ = రమేశ (ఆ + ఈ) = ఏ
రాజ + ఉత్తమ = రాజోత్తమ (అ + ఉ) = ఓ
గంగా + ఉదకము = గంగోదకము (ఆ + ఉ) = ఓ
దేవ + ఋషి = దేవర్షి (అ + ఋ) = అర్
మహా + ఋషి = మహర్షి (ఆ + ఋ) = ఆర్

ఇది ఏకాదేశ సంధి.

**3) వృద్ధి సంధి :**

ఐ - ఔ - అర్ అను వర్ణములు వృద్ధులు. వీని వలన ఏర్పడిన సంధి వృద్ధి సంధి.

అకారమునకు ఏ - ఐ లు పరమగునపుడు ఐకారమును, ఓ -ఔలు పరమైనపుడు ఔ కారమును వచ్చును. ఋకారము పరమైన అర్ - ఏకాదేశమగును.

అ + ఏ = ఐ — అ + ఐ = ఐ
అ + ఓ = ఔ — అ + ఔ = ఔ
అ + ఋ = అర్.

ఉదా : లోక + ఏక = లోకైక ( అ+ ఏ = ఐ)
సకల + ఐశ్వర్య = సకలైశ్వర్య ( అ + ఐ = ఐ)
పాప + ఓఘ = పాపౌఘ (అ + ఓ = ఔ)
రమా + ఔదార్య — రమౌదార్య
(అ + ఔ = ఔ)

ఋణము (అప్పు అను అర్థము) అనుపదము పరమైన అర్ వచ్చును. కావున నిది వృద్ధిసంధిగా గుర్తించవలెను.

ప్ర + ఋణము = ప్రార్ణము
వత్సతర + ఋణము = వత్సతరార్ణము
దశ + ఋణము = దశార్ణము
వసన + ఋణము = వసనార్ణము
కంబల + ఋణము = కంబలార్ణము
ఇవి ఏకాదేశ సంధి.

**4. యణాదేశ సంధి:**

ఇ - ఉ - ఋ అను వర్ణములు ఇక్కులు.
య - వ - ర - ల అనునవి యణ్ణులు.
ఇక్కుల స్థానమున యణ్ణులు ఆదేశమగుటచే ఇది యణాదేశ సంధి.

ఇ - ఉ - ఋ లకు అసవర్ణములైన అచ్చులు పరంబగునపుడు వరుసగ య - వ - ర - ల లు ఆదేశమగును.

అతి + అంతము = అత్యంతము
అత్ + ఇ + అంతము = ఇ + అ = య్
మధు + అరి = మధ్వరి
మధ్ + ఉ + అరి = ఉ + అ = వ్
పితృ + ఆదరము = పిత్రాదరము.
ఋ + ఆ = ర్
ఌ + అకృతి = లాకృతి - ఌ + అ = ల్

**5. అనునాసిక సంధి:**

నాసిక అనగా ముక్కు. ముక్కుతో పలుకు వర్ణములగుటచే వీనికి అనునాసికములని పేరు.

వర్గ ప్రథమాక్షరములగు ( క చ ట త ప లు) - అనునాసికములు పరమగునప్పుడు ఆయా వర్గానునాసికములు ఆదేశమగును.

వర్గమందలి తొలి అక్షరములైన క చ ట త ప లకు - న మ లు పరమగునపుడు ఆయా వర్గముల తుది వర్ణములు ఆదేశమగును.

వాక్ + నైపుణ్యము = వాఙ్నైపుణ్యము
వాక్ + మహిమ = వాఙ్మహిమ
రాట్ + నిలయము = రాణ్ణిలయము
రాట్ + మందిరము = రాణ్మందిరము
జగత్ + నాథ = జగన్నాథ
కకుప్ + నేత = కకుబ్నేత
లసత్ + మూర్తి = లసన్మూర్తి
మృట్ + మయము = మృణ్మయము
ఇది ఆదేశ సంధి.

6. జశ్త్వసంధి :

గ జ డ ద బ లకు ఆదేశముగ వచ్చు సంధి జశ్త్వ సంధి.

పరుషములకు అచ్చులుగాని, వర్గ తృతీయ - చతుర్థాక్షరాలుగాని - హయ వరలు పరమైనచో గ జ డ ద బ లు ఆదేశములగును.

వర్గ ప్రథమాక్షరాలు : క చ ట త ప లు.
పరుషములు.
వర్గతృతీయాక్షరములు : గ జ డ ద బ లు.
సరళములు.

వర్గచతుర్థాక్షరాలు : ఘ - ఝ - ఢ - ధ - భ లు

వాక్ + అధిపతి = వాగాధివతి

అచ్ + అంతము = అజంతము

రాట్ + గణము = రాట్గణము

తత్ + విధము = తద్విధము

కకుప్ + అధీశుడు = కుకుబధీశుడు

వాక్ + యుద్ధము = వాగ్యుద్ధము

తత్ + విధము = తద్విధము

శరత్ + రాత్రి = శరద్రాత్రి

తత్ + ధర్మము = తద్ధర్మము

ఇవి ఆదేశ సంధులు.

## 7. శ్చుత్వసంధి :

శ -చ -ఛ -జ -ఝ -ఞ - అను వర్ణములు శ్చుత్వములు.

సకారత వర్గములకు శకారచ వర్గములు పరమైనచో క్రమముగా అవియే ఆదేశములగును.

| స | త | థ | ద | ధ | న |
|---|---|---|---|---|---|
| శ | చ | ఛ | జ | ఝ | ఞ |

మనస్ + శాంతి = మనశ్ + శాంతి = మనశ్శాంతి

సత్ + చరితము = సచ్ + చరితము = సచ్చరితము

శరత్ + చంద్రిక = శరచ్చంద్రిక

తపస్ + శక్తి = తపశ్శక్తి

తత్ + చక్రము = తచ్చక్రము

ఇవి ఆదేశ సంధులు.

**8. లాదేశ సంధి:**

పదాంత మందలి తకారమునకు లకారము పరమైనచో లకారము ఆదేశమగును.

జగత్ + లీల = జగల్లీల
విద్యుత్ + లత = విద్యుల్లత
వసత్ + లక్ష్మి = వసల్లక్ష్మి

**9. విసర్గసంధి:**

సంస్కృత పదముల చివరనున్న విభక్తి ప్రత్యయము 'స్' కారము. ఉప సర్గపదములలోని 'స్' ముందుగ రేఫగా మారును. మరల ఆ రేఫము విసర్గమగును.

రామః అనుశబ్దము మొదట రామ+స్
తరువాత = రామ + ర్ రామః

దీనిని విసర్గ అందురు. వివిధ వర్ణములు విసర్గకు పరమగునపుడు ఆ విసర్గ పొందు మార్పులను సూచించునది విసర్గ సంధి.

1. విసర్గమునకు (సకారాంతము) క ఖ ప ఫ లు పరమగునపుడు విసర్గ మారదు.

మనః + కమలము = మనఃకమలము
మనః + ఖేదము = మనఃఖేదము
తపః + పుంజము = తపఃపుంజము
తపః + ఫలము = తపఃఫలము

2. అకారము పూర్వమందున్న విర్గమునకు హ్రస్వ అకారము - వర్గ తృతీయ చతుర్థ పంచమాక్షరములు - య

- ర - ల - వ - హ లు పరమైనచో, విసర్గ ఉకారముగా మారును. గుణము వచ్చి తుదకు ఓ కారమగును.

వర్గ తృతీయాక్షరాలు : గ జ డ ద బ
వర్గ చతుర్థాక్షరాలు : ఘ ఝ ఢ ధ భ
వర్గ పంచమాక్షరాలు : ఙ ఞ ణ న మ
మనః + గతము :
మన + ః + గతము
మన + ఉ + గతము, (గుణము)
మనోగతము.
ఇదే సూత్రమును ఈ క్రింది విధముగా కూడ చెప్పవచ్చును.

విసర్గమునకు కఖ పఫలుగాక మిగిలిన కలిగిన హల్లులుగాని అచ్చులుగాని పరమగునప్పుడు ఓ కారము వచ్చును.

దుః + ఉదరము = దురోదరము
తపః + వనము = తపోవనము
శిరః + రత్నము = శిరోరత్నము
మనః + హరము = మనోహరము
అన్యః + అన్య = అన్యోన్య
పయః + ఘృత = పయోఘృత
శిరః + మణి = శిరోమణి
రజః + రాగము = రజోరాగము

3. పూర్వమున అకారాద్యచ్చులు గల సకారాంత శబ్దములకు, వర్గ ప్రథమ, ద్వితీయాక్షరములు, శషలుగాక మిగిలిన హల్లులు అచ్చులు పరమగునప్పుడు రేఫము ఆదేశమగును.

అంతః + ఆత్మ = అంతరాత్మ

ఆశీః + నినాదము = ఆశీర్నినాదము

దుః + వృత్తము = దుర్వృత్తము

దుః + భావము = దుర్భావము

దుః + మానము = దుర్మానము

దుః + అవస్థ = దురవస్థ

పునః + దర్శనము = పునర్దర్శనము

దుః + వర్తనము = దుర్వర్తనము

చతుః + ఉపాయములు = చతురుపాయములు

హవిః + దావము = హవిర్దావము

చతుః + భుజము = చతుర్భుజము

ఇది ఆదేశ సంధి.

4. విసర్గమునకు చ ఛ లు పరమగునపుడు శ వర్ణము - ట ఠ లు పరములగు నప్పుడు ష వర్ణము, త థ లు పరమగునపుడు స వర్ణము వచ్చును.

దుః + చే ష్టితము = దుశ్చేష్టితము

ధనుః + టంకారము = ధనుష్టంకారము

మనః + తాపము = మనస్తాపము

5. విసర్గమునకు శ ష స లు పరమగునపుడు శ ష స లే వచ్చును.

తపః + శాంతి - తపశ్శాంతి

మనః + శాంతి = మనశ్శాంతి

చతుః + షష్టి = చతుష్షష్టి

తపః + సాధనము = తపస్సాధనము

ప్రాతః + సమము = ప్రాతస్సమము

# తెలుగు సంధులు

తెలుగునందు అ - ఇ - ఉ అను కురుచ అచ్చులకు తక్క ఇతర అచ్చులకు సంధిలేదు.

**1. అకారసంధి :**

అత్తునకు సంధి బహుళముగానగు. అత్తు అనగా హ్రస్వ అకారము. ఇదేవిధముగ ఉత్తు = హ్రస్వ ఉకారము - ఇత్తు - హ్రస్వ ఇకారము.. అత్తు - ఉత్తు - ఇత్తు. వీనిని సంస్కృతమున తవర కరణములందురు. హ్రస్వమగు అకారమునకు సంధి బహుళముగనగును, అని సూత్రార్థము.

బహుళ గ్రహణముచేత -
నిత్యముగా సంధి జరుగుట -
అయ్య - అమ్మ, అన్న - ఆకు మొదలగు పదములకు సంధి నిత్యము.

రామ + అయ్య - రామయ్య
రామ + అమ్మ - రామమ్మ
రామ + అన్న - రామన్న
చింత + ఆకు - చింతాకు మొదలైనవి.

వైకల్పికముగా, జరుగుట, అనగా ఒకసారి సంధి జరుగుట, మరియొకసారి సంధి జరుగకుండుట.

ఉదా :- మేన + అత్త = మేనత్త (సంధి)
మేనయత్త (యడాగమము)
చూడక + ఉండెను = చూడకుండెను (సంధి)
చూడక యుండెను (యడాగమము)

సంధి జరుగకుండుట-

స్త్రీ వాచక - తత్సమపద - సంబోధ నాంతంబులకు సంధి రాదు.

అమ్మ + ఇచ్చెను = అమ్మయిచ్చెను

దూత + ఇతడు = దూతయితడు

రాముడు + ఇదిగో = రాముడయిదిగో

అన్యవిధముగవచ్చుట

వెల + ఆలు = వెలయాలు.

**2. ఇకారసంధి :**

ఏమ్యాదుల ఇత్తునకు సంధి వైకల్పికముగ నగును. ఏమి - ఏది - ఏవి - అవి - ఇవి - కిన్ అనునవి ఏమ్యాదులు. ఇత్తు హ్రస్వ ఇకారము.

ఏమ్యాదుల హ్రస్వ ఇకారమునకు సంధి వైకల్పికముగా జరుగును.

**ఉదా :-** ఏమి + అంటివి = ఏమంటివి.
ఏమియంటివి

మఱి + ఏమి = మఱేమి
మఱియేమి

హరికిన్ + ఇచ్చె = హరికిచ్చె
హరికినిచ్చె.

ii క్రియాపదములందిత్తునకు సంధి వైకల్పికముగా నగును.

**ఉదా :-** వచ్చిరి + అప్పుడు = వచ్చిరప్పుడు; వచ్చిరి యప్పుడు.

వచ్చితిమి + ఇప్పుడు = వచ్చితిమిప్పుడు; వచ్చితిమి యిప్పుడు.

iii. మధ్యమ పురుష క్రియలందిత్తునకు సంధి యగు.

నీవు - మీరు అను మధ్యమ పురుష క్రియలందలి హ్రస్వమగు ఇ కారమునకు సంధి తప్పక జరుగును.

ఉదా :- ఏలితివి + అపుడు = ఏలితివపుడు
ఏలితి + ఇపుడు = ఏలితిపుడు
ఏలితిరి + ఇపుడు = ఏలితిరిపుడు.

iv. క్త్వార్థంబైన 'యిత్తు' నకు సంధి లేదు. క్త్వార్థమనగా భూతకాలమును తెల్పు, అసమాపక క్రియ. అట్టి క్రియ లందలి హ్రస్వ ఇ కారమునకు సంధి లేదు.

ఉదా :- వచ్చి + ఇచ్చిరి = వచ్చియిచ్చిరి.

ఇత్వసంధి కొన్నిచోట్ల వైకల్పికముగను, కొన్ని చోట్ల నిత్యముగను, మరికొన్నిచోట్ల నిషేధముగను జరుగును.

3. ఉకారసంధి :

ఉత్తునకు అచ్చుపరమగు నపుడు సంధి నిత్యము. హ్రస్వమగు ఉ కారమునకు అచ్చుపరమగునపుడు సంధి జరుగును.

ఉదా :- రాముడు + అతడు = రాముడతడు.
సోముడు + ఇతడు = సోముడితడు.
అతడు + ఉండెను = అతడుండెను.
వాడు + ఎవడు = వాడెవడు.

ఉ కారసంధి కొన్నిచోట్ల వైకల్పికము. ప్రథమేతర విభక్తి శత్రర్థక చు వర్ణము నందున్న ఉ కారమునకు సంధి వైకల్పికము. ప్రథమేతర విభక్తులనగా ద్వితీయ

- తృతీయ - చతుర్థి - పంచమి - షష్ఠి - సప్తమి - విభక్తులకు శత్రర్ధక చువర్ణము నందలి ద్రుతమునకు సంధి వైకల్పికము.

నన్నున్ + అడిగె = నన్నడిగె - నన్నునడిగె

నాకొఱకున్ + ఇచ్చె = నాకొఱకిచ్చె - నాకొఱకునిచ్చె

నాకున్ + ఆదరువు = నాకాదరువు - నాకునాదరువు

నాయందున్ + ఆశ = నాయందాశ - నాయందు నాశ

ఇందున్ + ఉన్నాడు = ఇందున్నాడు - ఇందు, నున్నాడు

ఎందున్ + ఉంటివి = ఎందుంటివి - ఎందునుంటివి

చూచుచున్ + ఏగెను = చూచుచేగెను - చూచుచునేగెను.

**4. యడాగమసంధి:**

సంధిలేని చోట, స్వరంబుకంటె పరంబైన స్వరంబునకు, యడాగమంబగు.

యట్ + ఆగమము = యడాగమము.

'యట్' లోని ట కారము ఈ చేయబోవు యడాగమము, సంధిలోని పర పదము మొదటనే, చేరవలెనని, సూచించి పోవును. య కారములోని అ కారము ఉచ్చారణా ర్థము అని గ్రహించవలెను. చేయబడు ఆగమము కేవలము 'య్' మాత్రము అని గ్రహించవలెను. సంధి రానిచోట, అచ్చు తర్వాత నున్న, అచ్చునకు, యకారమాగమ మగునని అర్థము. ఆగమమనగా మరియొక అక్షరము సంధిలో వచ్చి చేరుట.

ఉదా :- మా + అమ్మ - మా + య్ + అమ్మ = మాయమ్మ
మీ + ఇల్లు - మీ + య్ + ఇల్లు = మీయిల్లు
మా + ఊరు - మా + య్ + ఊరు = మీయూరు
ఇదిగో + ఇమ్ము = ఇదిగో + య్ + ఇమ్ము
ఇదిగో యిమ్ము - మొదలైనవి.

**5. టుగాగమసంధి :**

కర్మధారయమునం దుత్తునకు, అచ్చుపరమైనపుడు, టుగాగమంబగు.

విశేషణ, విశేష్యములకు, జరుగు సమాసము కర్మధారయము.

ఉత్తు = హ్రస్వమైన ఉకారము
టుక్ + ఆగమము = టుగాగమము

టుక్ - అనుపదము లోని 'క్' కారము ఈ రాబోవు ఆగమము సంధిలోని పూర్వ పదము చివర చేరవలెనని సూచించును. "టులోని ఉ కారము ఉచ్చారణార్థము ఆగమముగా వచ్చునది 'ట్' మాత్రమేయని గ్రహింపవలెను".

ఉదా :- కలుకు + అమ్మ = కలుకు + ట్ + అమ్మ
కలుకుటమ్మ - అల్లే
నిగ్గు + అద్దము = నిగ్గు + ట్ + అద్దము
నిగ్గుటద్దము
నరసపు + అలుక = నరసపు + ట్ + అలుక
నరసపుటలుక
చెక్కు + అద్దము = చెక్కు + ట్ + అద్దము
చెక్కుటద్దము

పండు + ఆకు = పండు + ట్ + ఆకు

పండుటాకు

II. కర్మధారయమునందు, పేర్వాది శబ్దముల కచ్చు పరంబగునపుడు, టుగాగమము విభాషణగు.

కర్మధారయమున, పేరులోన వానికి అచ్చు పరముకాగా టుగాగమము వైకల్పికముగానగును.

వేరు - చిగురు - తలిరు - అలరు మొదలైనవి పేర్వాదులు.

విభాష అనగా చెప్పిన టుగాగమము

ఒకసారి వచ్చుట - వేఱొకసారి రాక పోవుట అని అర్థము.

పేరు + ఉరము = పేరు + ట్ + ఉరము

పేరుటురము - పేరురము

చిగురు + ఆకు = చిగురు + ట్ + ఆకు

చిగురుటాకు - చిగురాకు

అలరు + అమ్ము = అలరు + ట్ + అమ్ము

అలరుటమ్ము - అలరమ్ము

పొదరు + ఇల్లు = పొదరు + ట్ + ఇల్లు

పొదరుటిల్లు - పొదరిల్లు.

6. పుంప్వాదేశసంధి :

కర్మధారయంబునందు, ము వర్ణమునకు, పుంపులగు. పుంపులు - పు - ంపు - అని అర్థము. ఇవి ఆదేశసంధి.

కర్మధారయ సమాసములోని, పూర్వపదము చివర గల 'ము' అను ప్రథమా విభక్తి ఏక వచన ప్రత్యయమునకు పు-గాని-ంపుగాని ఆదేశమగును.

ఉదా :- సరసము + మాట = సరసపుమాట
సరసంపుమాట
సౌందర్యము + పాలు = సౌందర్యపుపాలు
సౌందర్యంపుపాలు
ఆకాశము + పందిరి = ఆకాశపుపందిరి
ఆకాశంపుపందిరి.

7. సరళాదేశసంధి :

ద్రుత, ప్రకృతికముమీది, పరుషములకు సరళము లగు. ద్రుతమనగా నకారము-నుకారము-న్-లుగా గ్రహిం చవలెను. ద్రుతప్రకృతికముల తరువాత నున్న కచటతప అను వర్ణములకు సరళములగు గ జ డ ద బలుఆదేశముల గును.

| క | చ | ట | త | ప | పరుషములు |
|---|---|---|---|---|---|
| గ | జ | డ | ద | బ | సరళములు |

ఉదా :- పూచెను + కలువలు = పూచెనుగలువులు
తోచెన్ + చుక్కలు = తోచెనుజుక్కలు
చేసెన్ + టక్కులు = చేసెను డక్కులు
నెగడెన్ + తమములు = నెగదెను దమములు
మొగిడెను + పద్మము = మొగిడెను బద్మము.

ii. ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషణలు విభాషనగు. ఆదేశ సరళములనగా, వ్యాకరణ కార్యము వల్ల వచ్చిన గజడదబలు.

బిందువు — సున్న — 0

ఖండబిందువు — అరసున్న — ం

సంశ్లేషమనగా మీది హల్లుతోకూడిక. ఆదేశ సరళము లకు, ముందున్న ద్రుతమునకు బిందువుగాని - సంశ్లేషముగాని, వచ్చునని సూత్రార్థము.

ఉదా :- పూచెను + గలువ = ఇందలి 'గ' ఆదేశ సరళము.

పూచెంగలువలు = బిందువు

పూచెఁగలువలు = ఖండబిందువు

పూచెన్గలువలు = సంశ్లేషము.

తోచెను + జుక్కలు = తోచెంజుక్కలు

తోచెంజుక్కలు

తోజెన్జుక్కలు.

చేసెను + డెక్కలు = చేసెఁడెక్కలు

చేసెండెక్కలు

చేసెన్డెక్కలు.

నెగడెను + దమము = నెగడెఁదమము

నెగడెందమము

నెగడెన్దమము.

మొగిడెను + బద్మము = మొగిడెఁబద్మము

మొగిడెంబద్మము

(మొగిడెన్బద్మము)

**8. గసడదవాదేశ సంధి :**

ప్రథమము మీది పరుషములకు, గసడదవలు బహుళముగానగు - ప్రథమా విభక్తులమీది కచటతపలకు వరుసగా గసడదవలగు నని అర్థము. బహుళ మనుటచే వైకల్పికముగా - ఇతరములకు అగునని అర్థము.

| క | చ | ట | త | ప |
|---|---|---|---|---|
| గ | స | డ | ద | వ |

ఉదా :- వాడు + కొట్టె = వాడుగొట్టె - వాడుకొట్టె
నీవు + టక్కరివి = నీవుడక్కరివి - నీవుటక్కరివి
మీరు + తలడు = మీరుదలడు - మీరుతలడు
వారు + పోరు = వారువోరు - వారుపోరు.

ఇందు ప్రథమా విభక్తి 'డు' మీది పరుషములకు ఒకసారి గసడదవాదేశమైనది, ఒకసారి రాలేదు. వైకల్పికము (విభాష) అయినది.

ii. ఈ గసడదవాదేశము కళలగు, క్రియా పదములమీద సహితము కానంబడియెడి.

ఉదా :- రారు + కదా = రారుగదా। రారుకదా।
వత్తురు + పోదురు = వత్తురువోదురు - వత్తురుపోదురు

iii. తెనుగులమీది, సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు. సాంస్కృతిక పరుషములనగా సంస్కృత సమశబ్దములు. తెలుగు పదముల మీది సంస్కృత సమ పరుషములకు గసడదవలు రావు.

ఉదా :- వాడు + కంసారి = వాడు కంసారి
వీడు + చక్రపాణి = వీడు చక్రపాణి
ఆయది + టంకృతి = ఆయది టంకృతి
అది + తథ్యము = అది తథ్యము
ఇది + పథ్యము = ఇది పథ్యము. ఇందు కంసారి - చక్రపాణి - టంకృతి - తథ్యము - పథ్యము

మొదలైనవి. సంస్కృత సమ శబ్దములు. అందు వల్ల సరళములురాక, పరుషములే నిల్చినవి.

iv. ద్వంద్వంబునం, బదంబుల పయి పరుషములకు, గసడదవ లగు. ద్వంద్వమనగా ద్వంద్వసమాసము. ద్వంద్వ సమాసముమీది పరుషములకు, గ స డ ద వలు, ఆదేశముగ వచ్చును.

ఉదా :- కూర + కాయ = కూరగాయలు
కాలు + చేతులు = కాలుసేతులు
టెక్కు + టెక్కు = టెక్కుడెక్కులు
తల్లి + తండ్రి = తల్లిదండ్రులు
ఊరు + పల్లె = ఊరువల్లెలు
దీనికి వైకల్పిక విధిలేదు.

9. రుగాగమ సంధి :

కర్మధారయము లందు, పేదాది శబ్దములకు ఆలు శబ్దము, పరంబగునపుడు, రుగాగమంబగును.

**పేదాదులు :** పేద - బీద - జవ - కొమ - బాలెంత - మనుమ - గొడ్డు - ముద్ది మొదలగునవి పేదాదులు. ఇవి కేవలము అచ్చతెలుగు పదములకు సంబంధించినవి - ఆలు శబ్దము స్త్రీ మాత్ర పరము.

'' రుక్ '' ఆగమము రుగాగమము. ' క్ ' అను వర్ణము సంధిలో చేయబడు ఆగమవర్ణము. పూర్వపదము చివరి మాత్రమే వచ్చునని, శాసించి పోవును. రు వర్ణములోని ఉ కారము ఉచ్చారణార్థమని గ్రహించవలెను. మిగులునవి ' ర్ ' మాత్రమే.

ఉదా :- పేద + ఆలు = పేద + ర్ + ఆలు = పేదరాలు
కొమ + ఆలు = కొమ + ర్ + ఆలు = కొమరాలు
ముద్ద + ఆలు = ముద్ద + ర్ + ఆలు = ముద్దరాలు
జవ + ఆలు = జవ + ర్ + ఆలు = జవరాలు
బాలెంత + ఆలు = బాలెంత + ర్ + ఆలు = బాలెంతరాలు
మనుమ + ఆలు = మనుమ + ర్ + ఆలు = మనుమరాలు

ii. కర్మధారయంబులందు, తత్సమశబ్దంబులకు, ఆలు శబ్దము పరంబగునపుడు, అత్వంబునకు ఉత్వంబును, రుగాగమంబు నగు. తత్సమ శబ్దములకు ఆలు శబ్దము పరమైన ఆ తత్సమశబ్దము చివర అ కారమునకు ఉ కారమునకు, పిదప రుగాగమంబు, వచ్చునని అర్థము.

ఉదా :- ధీర + ఆలు = ధీర + ఉ + ఆలు = ధీరురాలు
నాయక + ఆలు = నాయక + ఉ + ఆలు
నాయకు + ర్ + ఆలు = నాయకురాలు
శ్రీమంత + ఆలు = శ్రీమంత + ఉ + ఆలు
శ్రీమంతు + ర్ + ఆలు = శ్రీమంతురాలు
బలవంత + ఆలు = బలవంత + ఉ + ఆలు
బలవంతు + ర్ + ఆలు = బలవంతురాలు

**10. దుగాగమసంధి :**

నీ-నా-తన శబ్దములకు, ఉత్తరపదంబు పరం బగునపుడు దుగాగమంబగు.

దుక్ + ఆగమము = దుగాగమము.
ఉత్తరపదము పరమగు టయన, సమాసమగు నని భావము. క్ - -కారములోపించును.
నీ + వార్త - నీదు వార్త

నా + పలుకు - నాదుపలుకు

తన + రాక - తనదురాక

**11. ద్విరుక్తటకారసంధి :**

కుఱు-చిఱు-కడు-నడు-నిడు శబ్దముల ఱ-డలకు అచ్చు పరంబగునపుడు ద్విరుక్త టకారంబగు.

కుఱు-చిఱు అను పదములలోని ఱకారమునకు -నడు-నిడు-కడు పదములలోని డ కారమునకు - అచ్చుతో మొదలైన పదములు పరమైన, ద్విరుక్తమగు 'ట్ట్' ఆదేశమగును. ఱ - డ లు అనగా ఱకార, డ కారములు. ద్విరుక్తమనగా రెండు మారులు పలుకబడుట - ద్విత్వము.

ఉదా :- కుఱు + ఉసురు = కుట్ + ట్ + ఉసురు
కుట్టుసురు.

చిఱు + ఎలుక = చిట్ + ట్ + ఎలుక
చిట్టెలుక.

నడు + ఇల్లు = నట్ + ట్ + ఇల్లు
నట్టిల్లు.

నిడు + ఊర్పు = నిట్ + ట్ + ఊర్పు
నిట్టూర్పు.

కడు + అలుక = కట్ + ట్ + అలుక
కట్టలుక.

**12. త్రికసంధి :**

1. ఆ - ఈ - ఏ లు త్రికములు అనబడును.
2. త్రికంబుమీది అసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు.

3. ద్విరుక్తంబగు హల్లు పరంబగునపుడు ఆచ్ఛికంబుమీది, దీర్ఘంబునకు హ్రస్వంబగు.
ఉదా :- ఆ + కన్య - ఆత్రికము.

రెండవ సూత్రము వలన ఉత్తర పదాది అక్షరమైన 'క' అసంయుక్తము కాన దానికి ద్విత్వము వచ్చి, ఆ + క్కన్య - అయినది. మూడవ సూత్రము వలన, ద్విరుక్తమైన హల్లుకు పూర్వమందున్న ఆచ్ఛికమగు, ఆకారము హ్రస్వమై - అకారమగును.

అప్పుడు అక్కన్య - అను రూపమేర్పడును. ఆచ్ఛికములు - తెలుగు పదములు, ద్విరుక్తము. రెండుసార్లు ఉచ్చరించబడునది.

ఉదా:- ఆ + కాన = అక్కాన
ఈ + కాన = ఇక్కాన
ఏ + కాన = ఎక్కాన

అట్లే అత్తరి - ఇత్తరి - ఎత్తరి - రూపములు గ్రహించునది.

## 13. ఆమ్రేడిత సంధి :

I. అచ్చునకు ఆమ్రేడితము, పరంబగునపుడు సంధి తరుచుగా అగును. ద్విరుక్తము యొక్క పర రూపము ఆమ్రేడితము.

ఔర + ఔర = ఔర - ఆమ్రేడితము
ఆహా + ఆహా = ఆహాహా
ఎట్లు + ఎట్లూ = ఎట్లెట్లూ
ఏగి + ఏగి = ఏగేగి
ఏమి + ఏమి = ఏమేమి - ఏమియేమి

ఏమ్యాదుల ఇ కారమునకు సంధి వైకల్పికము అగుటవలన ఏమికి రెండు రూపములు వచ్చినవి.

**II.** ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదుల తొలియచ్చుమీది వర్ణంబులలెల్ల, అదంతంబగు, ద్విరుక్తటకారంబగు.

కడాదులు - కడ - ఎదురు - కొన - చివర - తుద - తెన్ను - తెరవు - నడుమ - పగలు - పిడుగు - బయలు - మొదలు ఇత్యాదులు. ఆమ్రేడితమున మొదటి పదముమీది వర్ణముల కన్నింటికి, హ్రస్వ అకారము అంతముందు గల ద్విరుక్తటకారము ఆదేశమగును.

కడ + కడ = క + ట్ట + కడ = కట్టకడ.
ఎదురు + ఎదురు = ఎ + ట్ట + ఎదురు = ఎట్టయెదురు
ఇట్లే తక్కినవి గ్రహించునది.

**III.** ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు తరుచుగ నగు. ఆమ్రేడితము పరమగునపుడు పూర్వపదము తుది నున్న విభక్తి బహుళముగ లోపించును.

అప్పటికిన్ + అప్పటికిన్ = అప్పటప్పటికిన్ -
అప్పటికప్పటికిన్.
అక్కడన్ + అక్కడన్ = అక్కడక్కడన్ -
అక్కడనక్కడన్.
ఇంటన్ + ఇంటన్ = ఇంటింటన్ - ఇంటనింటన్.

బహుళమనుటచే, ఇంచుక-నాడు ఇత్యాదులందును విభక్తి లోపించును.

ఇంచుక + ఇంచుక = ఇంచించుక - ఇంచుకయించుక
నాడు + నాడు = నానాడు - నాడునాడు.

IV. అందదుకు ప్రభృతులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యములు. అదుకు మొదలగునవి ప్రయోగించినట్లే తక్కినవియు ప్రయోగార్హములని గ్రహించవలెను.

ఉదా : అదుకు + అదుకు = అందదుకు
ఇంకులు + ఇంకులు = ఇల్లింకులు
ఇగ్గులు + ఇగ్గులు = ఇల్లిగ్గులు
చెదరు + చెదరు = చెల్లాచెదరు
తునియలు + తునియలు = తుత్తునియలు
మిట్లు + మిట్లు = మిరుమిట్లు.

14. నుగాగమసంధి :

సమాసంబున, నుదంత స్త్రీ సమంబులకు, పుంపులకు అదంత గుణ వాచకంబునకు, తనంబు పరంబగునపుడు నుగాగమంబగు. సమాసము నందు, హ్రస్వ ఉ కారము చివర గల స్త్రీ సమపదములకు, - పుంపులకు, హ్రస్వ అకారము, చివరగల గుణవాచకము లకు, తనయు పరంబగునపుడు నుగాగమమగును. ఇది వచ్చినపుడు అర్ధబిందు - బిందు - సంశ్లేష రూపములు మూడును జరుగును.

ఉదా :- సొగను + తనము = సొగను + న్ + తనము
సొగనుఁదనము
సొగనుందనము
సొగనున్దనము.
సొగను - ఉదంత స్త్రీసమము.

ఉదా : రాజు + యొక్క + ఆజ్ఞ
రాజు + ఆజ్ఞ
రాజు + ను + ఆజ్ఞ - రాజునాజ్ఞ.
పితృ + యొక్క + ఆనతి
పితృ + ను + ఆనతి = పితృనానతి అగును.

**15. ప్రాతాధిసంధి :**

సమాసంబున, ప్రాతాదుల తొలియచ్చు మీది వర్ణంబుల లెల్ల, లోపంబు బహుళంబుగానగు.

ప్రాత + ఇల్లు = ప్రాయిల్లు - ప్రాతయిల్లు
లేత + దూడ = లేదూడ - లేతదూడ
పూవు + రెమ్మ = పూరెమ్మ - పూవురెమ్మ.

ప్రాత మొదలగు, శబ్దములచే నేర్పడు సమాసమున మొదటి అచ్చుమీది, వర్ణంబులకెల్లను లోపము బహుళముగా నగును.

ప్ + ర్ + ఆ - త్ + అ = ప్రాత - ఇందు మొదటి అచ్చు ' అ ' మీది అక్షరములన్నియు లోపింపగా ప్ + ర్ + ఆ = మిగిలి (ప్రా) త్ + అ = త లోపించును. అప్పుడు ప్రా-ఇల్లు-యడాగమమురాగా ప్రా + య్ + ఇల్లు = ప్రాయిల్లు-లోపించనియెడల ప్రాతయిల్లు అనియే యుండును ఇట్లే తక్కిన ఉదాహరణములు గ్రహించునది.

ii. లుప్త శేషమునకు, పరుషములు పరములగునపుడు, నుగాగమంబగు.

ప్రాత + కెంపు = ప్రాగెంపు
లేత + కొమ్మ = లేగొమ్మ

పూవు + తోట = పూదోట

మీదు + కడ = మీగడ

కెంపు + తామర = కెందామర

చెన్ను + తోవ = చెందోవ.

లుప్త శేషమున, లోపింపగా మిగిలినది, ప్రాతలో త లోపింప ప్రా మిగులును. దానికి పరుషము పరముకాగా నుగాగమమగును. ప్రాతలో తలోపింప ప్రా శేషించును. ప్రా + కెంపు - అనుచో ప్రా మీది 'కె' పరుషము పరముకాగా నుగాగమమై ప్రా + ను + కెంపు = ప్రాగెంపు. ఇచ్చట సరళాదేశసంధి యు జరిగినది, ఇట్లే పూదోట తెలియునది. మీదు + కడలో 'దు' లోపించి - మీ + కడ యగును. నుగాగమమైన, సరళాదేశసంధి జరిగి, మీ + ను + కడ = మీగడ అగును. కెంపులో కె మిగులును - తామర అను దానిలో, తా పరుషము చేరగా, నుగాగమ మగును. కె + ను + తామర = కెందామర.

ఇందు ద్రుత సంధి జరిగి, కెందామర అయింది.

అట్లే చెన్ను + తొవ

చె + తొవ

చె + ను + తొవ - చెందొవ.

iii. క్రొత్త శబ్దమునకు, ఆద్యక్షర శేషమునకు కొన్ని యెడల, నుగాగమంబును, కొన్ని యెడల మీది హల్లునకు ద్విత్వము నగు.

క్రొత్త + చాయ = క్రొంజాయ

క్రొత్త + చెమట = క్రొంజెమట

క్రొత్త + పసిడి = క్రొంబసిడి

క్రొత్త + కారు = క్రొక్కారు
క్రొత్త + నన = క్రొన్నన
క్రొత్త + తావి = క్రొత్తావి.

క్రొత్త శబ్దము ప్రాతాదుల లోనిది. క్రొత్తలో మొదటి అక్షరమునకు పరుషము పరముకాగా, నుగాగమ మగును. కొన్ని చోట్ల మీది హల్లున మీ ద్విత్వమగును. క్రొత్తలో - క్రొ మిగిలును-చాయ-పరము కాగా నుగాగమమువచ్చి క్రొ + ను + చాయ అగును. తర్వాత సరళాదేశము వచ్చి నిండు సున్న వచ్చి - క్రొంజాయ అయినది.

అట్లే క్రొంజెమట - క్రొంబసిడి గ్రహించునది.

క్రొత్తలో క్రొ మిగిలి కారులో-కా పరుషము - సరళము కాగా నుగాగమము రాక బహుళ గ్రహణముచే హల్లునకు ద్విత్వము వచ్చును.

క్రొ + కారు - క్రొ + క్ + కారు = క్రొక్కారు
క్రొ + నన - క్రొ + న్ + నన = క్రొన్నన
క్రొ + తావి - క్రొ + త్ + తావి = క్రొత్తావి.

iv. అన్వంబులకు సహితమీ, కార్యంబు కొండొకచో కానంబడెయెడి.

పది + తొమ్మిది = పందొమ్మిది
తొమ్మిది + పది = తొంబది
వంక + చెఱకు = వంజెఱకు
సగము + కోరు = సంగోరు
నిండు + వెర = నివ్వెర
నెఱ + తఱి = నెత్తఱి

పది + తొమ్మిది -ప మిగిలి, తొమ్మిది పరముకాగా, నుగాగమమై - సరళాదేశము వచ్చి - ప + న్ = తొమ్మిది = పందొమ్మిది అయినది. ఇందు నిండు సున్న చేరినది.

అట్లే తొంబదిలోను రూపములు గ్రహించునది.

నిండు + వెర = లో - ని మిగిలి - వెరపరము కాగా, మీది హల్లునకు ద్విత్వము వచ్చి ని + వ్ + వెర = నివ్వెర అయినది. అట్లే తక్కిన రూపము లెరుగునది.

16. పడ్వాదేశసంధి :

పడ్వాదులు, పరంబగునపుడు, ము వర్ణమునకు లోప, పూర్ణబిందువులు, విభాషనగు.

భయము + పడె - భయపడె
భయంపడె
భయముపడె

సూత్రము + పట్టె - సూత్రపట్టె
సూత్రం పట్టె
సూత్రముపట్టె.

పడ్వాదులు - పడు - పెట్టు - పెట్టు మొ..నవి. ఈ కార్యము కర్తృవాచి ము వర్ణమునకు కలుగదు.

గజముపడియె - అశ్వము పడియె. పడు - -మొదలగునవి పరంబగునపుడు ప్రథమా విభక్తి ప్రత్యయముగల, ము వర్ణమునకు లోపముగాని, పూర్ణ బిందువుగాని వికల్పముగా వచ్చును. భయము + పడె = భయపడె. ము వర్ణము లోపించినది. పూర్ణ బిందువు రాగా భయంపడె రూపము కల్గును. ఈ లోప - పూర్ణ బిందువులు రానిచో భయముపడె అని లోపముకాని రూపమే యుండును. ఇట్లే రెండవ ఉదాహరణము గ్రహించునది. ఈ ము వర్ణలోపము కర్తను

దెల్పు పదమునకు కలుగదు. గజముపడె - ఇది పడియె అను క్రియాపదమునకు గజము కర్త. దాని ము వర్ణమునకు లోపమురాదు. పూర్ణ బిందువును కలుగదు. గజంపడియె - అశ్వంపడియె - అనునవి అసాధు రూపములు.

**17. దు వర్ణ లోప సంధి :**

సమానాధికరణంబగు, ఉత్తరపదంబు, పరం బగు నపుడు, మూడుశబ్దము, దు వర్ణమునకు లోపమును, మీది హల్లునకు, ద్విత్వమును విభాషనగు.

మూడు + జగములు = ముజ్జగములు
మూడు + లోకములు = ముల్లోకములు

విశేషణ విశేష్యములకు ఒక పదమే ఆశ్రయమగుట సమానాది కరణము. అట్టి సమాసములో ఉత్తర పదము పరమగునపుడు పూర్వపదముగా మూడు శబ్దమున్న యెడల దానిలోని దు-లోపించి మీది హల్లునకు ద్విత్వము వచ్చును.

మూ + జ్జగములు.

ద్విరుక్తంబగు హల్లు పరంబగునపుడు, ఆచ్ఛికంబు మీది, దీర్ఘంబునకు హ్రస్వంబగు, అను సూత్రము ననుసరించి, 'మూ' లోని దీర్ఘము లోపించి 'ము' అగును - అప్పుడు
ముజ్జగములు - ముల్లోకములు
అను రూపములు ఏర్పడును.

**18. పోద్వాదేశసంధి :**

బహువ్రీహిని స్త్రీ వాచ్యంబగుచో, ను పమానంబు మీది, మేనునకు బోడియగు.

పూర్వపద మువమావాచకమై, యుత్తర పదముగా మేను శబ్దమున్నచో, ఆ మేను శబ్దమునకు బోడియను నదాదేశముగ వచ్చును.

అలరు + మేను = అలరుబోడి
నన + మేను = ననబోడి
పూ + మేను = పూబోడి
విరి + మేను = విరిబోడి.

**19. లు–ల–న ల సంధి:**

లు-ల-నలు పరంబగునపుడు డొకానొకచో, ముగాగమంబునకు లోపంబును తత్పూర్వస్వరంబునకు, దీర్ఘంబును విభాషణగు లు-ల-నలు పరమగు నపుడు, ఆగమమైన 'ము' వర్ణమునకు కొన్ని చోటుల లోపమును దానికి ముందున్న అచ్చునకు దీర్ఘమును వికల్పముగా వచ్చును.

వజ్రము + లు = వజ్రాలు
వజ్రము + ల = వజ్రాల
వజ్రము + న = వజ్రాన
పగడము + లు = పగడాలు
పగడము + ల = పగడాల
పగడము + న = పగడాన.

**20. అవదాదిస్వరసంధి:**

అందు అవగాగమంబు లందప్ప, నపదాది స్వరంబు పరంబగునపుడు అచ్చునకు సంధియగు.

మూర + ఎడు = మూరెడు

వీసె + ఎడు = వీసెడు

ఇందు 'ఎడు' అపదము. అనగా స్వతంత్ర ప్రయోగములేనిది.

**21.** అల్లోపసంధి :

అది-అవి శబ్దముల అకారమునకు సమాసమున, లోపము బహుళముగ వచ్చును.

ఉదా: ఎక్కడ + అది = ఎక్కడిది

ఎట్టి + అది = ఎట్టిది

నా + అది = నాది.

**22.** తకారాదేశసంధి ;

చు వర్ణంబు తోడి, దుగ్దకారంబు తకారంబగు.

ఇచ్చు + దును = ఇత్తును

వచ్చు + దము = వత్తము

తెచ్చు + దును = తెత్తును

చూచు + దము = చూతము

నియమించు + దురు = నియమింతురు.

**23.** తచ్ఛబ్ద వకారలోపసంధి :

ఉన్న-కల-న వర్ణముల మీది తచ్ఛబ్ద వకారమునకు, లోపము విభాషణగు.

ఉదా:- ఉన్న + వాడు = ఉన్నాడు - ఉన్నవాడు

కల + వాడు = కలాడు - కలవాడు

చేసిన + వాడు = చేసినాడు - చేసినవాడు.

ఆచ్ఛిక సమాసము లందు, తఱచుగ వర్ణలోప - ఆగమ- ఆదేశాది వికారములు నిత్యవైకల్పికముగా పెక్కులు కానంబడియెడి-

ఉదా:- అంత + దాకే = అందాక

కవ + వడి = కవ్వడి

సగము + పాలు = సాబాలు

ఏడు + పది = డెబ్బది

నడుము + రేయి = నడురేయి

నిక్కము + కల = నిక్కల

మూడు + న్నాళ్లు = మూన్నాళ్లు

ఇంత + దనుక = ఇందనుక.

## 3. ప్రశ్నలు

1) సంధి అనగానేమి? సంది యెట్లు జరుగును?
2) ఆగమ-ఆదేశ-ఏకాసంధులను వివరింపుము?
3) సంస్కృత సంధులేవి? అనునాసిక సంధిని సోదాహరణ ముగా తెల్పుము.
4) ఈక్రింది సంధులకు సూత్రములు వ్రాయుము.
   1) ప్రాయిల్లు 2) ఏమంటివి 3) వాడెవడు 4) మాయమ్మ 5) చెక్కుటద్దము 6) సరసపుమాట 7) కూరగాయలు 8) పేదరాలు 9) నిట్టూర్పు 10) అక్కన.

# 4. సమాస విభాగము

I. సమాసము - వివరణ

సమాస భేదములు

సాంస్కృతిక

మిశ్రమ

ఆచ్ఛిక సమాసములు

II. అర్థ భేదమును బట్టి సమాసములు

1) తత్పురుష సమాసము
2) కర్మధారయ సమాసము
3) ద్విగు సమాసము
4) ద్వంద్వ సమాసము
5) బహువ్రీహి సమాసము
6) అవ్యయీ భావ సమాసము

## సమాస పరిచ్ఛేదము

సమర్థములగు, పదములు, ఏకపదముగా, సమసించుట, సమాసమనబడును.

వేరు వేరు అర్థముల, యందు, స్థిర పడిన రెండుగాని, అంతకుమించి గాని, పదములు ఒక్క అర్థమును బోధించుచు, ఒకే పదముగా భాసించినచో, సమాసమందురు.

ఉదా :- రామబాణము.

ఇది యొక సమాసము. ఇందు రెండు పదములున్నవి.

అవి రెండును వేర్వేరు అర్థబోధకములైనప్పటికి, సమసింపబడి ఒకే అర్థమును తెల్పుచున్నవి. రామ - బాణము - ఇందు మొదటి పదమును పూర్వపదమని -రెండవ పదమును, ఉత్తర పదమనియు అందురు.

శబ్దమును అనుసరించి సమాసములు మూడు విధములు. అవి :

1) సాంస్కృతికము
2) ఆచ్ఛికము
3) మిశ్రమము

సాంస్కృతికము మరల రెండు విధములు.
సిద్ధ సమాసము - సాధ్య సమాసము.

కేవల సంస్కృత పదములు సంస్కృత వ్యాకరణము ననుసరించి, సమసింపబడినవి సిద్ధ సమాసములు.

ఉదా :- రాజపుత్రుడు
రాజాజ్ఞ
తటాకోదకము.

తత్సమపదములతో, నేర్పడిన, సమాసము సాధ్య సమాసము.
రాజునాజ్ఞ-తటాకంబు నుదకము ఆచ్ఛిక సమాసము.
అచ్చ తెలుగుపదములతో నేర్పడు సమాసము.

ఉదా:- చెఱువునీరు - ఱేనియానతి
సిరి చెలువుడు - కుంతి కొడుకు మొదలైనవి.

మిశ్రమ సమాసము :- తత్సమ ఆచ్ఛిక పదములతో నేర్పడు సమాసము.

ఉదా :- చెఱువునుదకము
రాజుముదల
తెల్ల పద్మము.

మంచి బాలుడు మొదలైనవి. మిశ్రమ సమాసమనుట వలన కేవలము సంస్కృత శబ్దములకు, ఆచ్ఛిక పదములకు, సమానము చేయరాదు.

అనేకమారులు-ఘృత గిన్నె అని అనరాదు. సమాసము లోని, పదములె ప్రాధాన్యతను బట్టి, సమాసముల నాల్గు విధములుగ విభజింపవచ్చును. అవి :

1) పూర్వపద ప్రాధాన్యము కలవి ద్విగు సమాసములు
2) ఉత్తర పద ప్రాధాన్యము కలవి తత్పురుష సమాసములు
3) ఉభయ పద ప్రాధాన్యము కలవి ద్వంద్వ సమాసములు
4) అన్యపదార్థ ప్రాధాన్యము కలవి. బహువ్రీహి సమాసములు

**అర్థ భేదమును బట్టి సమాసములు ఆఱు విధములు.**

అవి : 1) తత్పురుష సమాసము
2) కర్మధారయ సమాసము
3) ద్విగు సమాసము
4) ద్వంద్వ సమాసము
5) బహువ్రీహి సమాసము
6) అవ్యయీ భావ సమాసము.

ఉత్తర పదార్థము ప్రధానముగా గలది తత్పురుష సమాసము. రామ బాణము - ఇందు పూర్వపదము రామ - ఉత్తరపదము బాణము. రామ బాణముతో చంపెను. అనగా ఇందు బాణము ప్రధానము. క్రియతో సంబంధము కలిగియుండును. మొదటి

పదము లోపించిన విభక్తి పేరు సమాసమునకు వచ్చును. ఇది వ్యధి కరణ సమాసము. లోపించిన విభక్తిని చేర్చి చెప్పుట విగ్రహ వాక్యము.

| | సమాసము | విగ్రహవాక్యము | సమాసనామము |
|---|---|---|---|
| 1. | అర్ధ రాజ్యము<br>కడతల | రాజ్యము యొక్క అర్ధభాగము<br>తల యొక్క కడ భాగము. | ప్రథమా తత్పురుష సమాసము |
| 2. | కృష్ణ శ్రితుడు<br>నెలతాల్పు | కృష్ణుని ఆశ్రయించిన వాడు<br>నెలను ధరించిన వాడు. | ద్వితీయా తత్పురుష సమాసము |
| 3. | గుణహీనుడు<br>నెల తక్కువ వాడు | గుణము చేత హీనుడు<br>నెలచేత తక్కువ వాడు. | తృతీయ తత్పురుష సమాసము |
| 4. | పూజా గృహము<br>దేవర మేలు | పూజ కొఱకు గృహము దేవర కొఱకు మేలు. | చతుర్థీతత్పురుష సమాసము |
| 5. | ప్రాణాధికుడు<br>దొంగ భయము | ప్రాణముకంటె అధికుడు<br>దొంగ వలన భయము. | పంచమీతత్పురుష సమాసము |

| 6. | రాజభటుడు<br>చెట్టు కొమ్మ | రాజుయొక్క భటుడు<br>చెట్టు యొక్క కొమ్మ. | షష్ఠీ తత్పురుష సమాసము |
|---|---|---|---|
| 7. | గృహకృత్యములు<br>మాట నేర్పరి | గృహమందలి కృత్యములు<br>మాట యందు నేర్పరి. | సప్తమీ తత్పురుష సమాసము |
| 8. | అజ్ఞానము<br>అసత్యము | జ్ఞానము లేనిది.<br>సత్యము కానిది. | నఞ్తత్పురుష సమాసము |

**2. కర్మధారయ సమాసము :**

విశేషణ, విశేష్యముల (నామవాచకము) తో ఏర్పడు సమాసము కర్మధారయ సమాసము. ఇది సమానాధి కరణ సమాసము.

| 1. | సరసపుమాట.<br>పెద్ద గుఱ్ఱము. | సరసమైన మాట.<br>పెద్దదైన గుఱ్ఱము. | విశేషణ పూర్వ పద కర్మధారయ సమాసము. |
|---|---|---|---|
| 2. | బ్రాహ్మణ వృద్ధుడు.<br>కపోత వృద్ధము. | వృద్ధుడైన బ్రాహ్మణుడు.<br>వృద్ధమైన కపోతము. | విశేషణ ఉ.పద కర్మధారయ సమాసము. |
| 3. | శీతోష్ణము నీరు<br>మృదు మధు రము కవిత. | శీతము ఉష్ణమై నీరు.<br>మృదువు మధుర మైన కవిత. | వి.ఉభయ పద కర్మధారయ సమాసము. |

| 4. | చిగురు కేలు<br>బింబోష్ఠము. | చిగురువంటి కేలు<br>బింబము వంటి<br>ఉష్ఠము. | ఉపమానపూర్వపద<br>కర్మధారయ సమా<br>సము. |
|---|---|---|---|
| 5. | చరణ కమలము<br>ముఖారవిందము | కమలము వంటి<br>చరణము.<br>అరవిందము వంటి<br>ముఖము. | ఉపమాన ఉత్తరపద<br>కర్మధారయ<br>సమాసము |
| 6. | క్రోధాగ్ని<br>విద్యా ధనము. | క్రోపమనెడి అగ్ని<br>విద్యయనెడి<br>దనము | రూపక సమాసము<br>లేక అవధారణ<br>పూర్వ పద కర్మ<br>ధారయ<br>సమాసము. |
| 7. | గంగానది<br>మధురానగరము. | గంగ అను పేరు<br>గల నది. మధుర<br>అను పేరు గల<br>నగరము. | సంభావనా పూర్వ<br>పద కర్మధారయ<br>సమాసము. |
| 8. | ఆ కన్య.<br>ఈ పుస్తకము. | | త్రికపూర్వక కర్మ<br>ధారయ సమాసము. |
| 9. | గాజుల సెట్టి | గాజులమ్ము సెట్టి | మధ్యమ పద<br>సమాసము. |

అవధారణ పూర్వపద కర్మధారయ సమాసము. అవధారణ మనగా ఒక వస్తువు నందు మరి యొక ధర్మమును ఆరోపించుట. అట్టిది పూర్వపదముగా గలది.

ఇందు గల ఉపమాన ఉపమేయములు రెండు ఒక్కటియే అయి యుండును. దీనినే రూపక సమాస మందురు. సంభావన అనగా గౌరవించుట. ఇందు మొదటి పదము సంజ్ఞావాచకముగ ఉండును. రెండవ పదము జాతి వాచకముగ నుండును.

**3. ద్విగు సమాసము :**

సంఖ్యా వాచకపదము పూర్వమున కలది ద్విగు సమాసము. ఇవి మూడు విధములు.

1. **తద్ధితార్థ ద్విగువు :** తద్ధిత ప్రత్యయములు చేర్చుటకై చేసిన ద్విగువు.

   **ఉదా :** షాణ్మాతురుడు - ఆఱుగురు తల్లుల కొడుకు.
   ద్వైమాతురుడు.

2. **ఉత్తరపద ద్విగువు :** ఉత్తర పదము పరముగా నుండగా వచ్చు ద్విగువు.

   **ఉదా :** పంచగవధనుడు - ఐదు ఆవులు ధనముగా గల వాడు. ధన అను ఉత్తరపదము పరముగా నుండుటచే వచ్చిన ద్విగువు.

   ఇట్లే - ద్వ్యహ్నజాతుడు.
   రెండు దినముల క్రింద పుట్టిన వాడని భావము.

3. **సమాహారద్విగువు :** సమాహారమని అర్థమిందువచ్చును.
   త్రిలోకి - మూడు లోకముల సమాహారము.
   శతగ్రంథి - శతమైన గ్రంథముల సమాహారము.

**4. ద్వంద్వ సమాసము :**

ఉభయ పదముల అర్థము ప్రధానముగా గలది.

ద్వంద్వసమాసము. విగ్రహ వాక్యమున ను- అను సముచ్ఛయము చేర్చబడును.
ఇవి రెండు విధములు.

**ద్విపద ద్వంద్వము :**

**ఉదా :** రామకృష్ణులు - అన్నదమ్ములు.
రాధాకృష్ణులు - మొదలైనవి.

రెండు కన్న యెక్కువ పదములతో కూర్చిన
**బహుపద ద్వంద్వ సమాసము :**

**ఉదా :** ధర్మార్థకామమోక్షములు.
సత్త్వరజస్తమో గుణములు.

**5. బహువ్రీహి సమాసము :**

కర్మధారయము కన్న-కల అను అర్థము ఎక్కువగా నున్న, బహువ్రీహి సమాసము. రెండు పదముల అర్థములేక వేరైన మరొక అర్థము ప్రధానమైన బహువ్రీహి సమాసము. పీత + అంబర-అనుపదములకు పచ్చని వస్త్ర మని అర్థమైనను-వీటి కలయికచే వేరొక అర్థము స్ఫురించు చున్నది. అన్యపదార్థము ప్రధానమైనది బహువ్రీహి. పీతాంబరుడు-పచ్చనివస్త్రము కలవాడు. ఇందు విగ్రహ వాక్యమున కలది కలవాడు అనివచ్చును. ఇది యెప్పుడును విశేషణమే కాన విశేష్యమును బట్టి లింగవచన విభక్తులుండును.

కమలాక్షుడు = కమలముల వంటి కన్నులు కలవాడు (విష్ణుమూర్తి)
పద్మాలయ = పద్మము నిలయముగా కలది (లక్ష్మి).

**6. అవ్యయీభావ సమాసము :**

లింగ, వచన, విభక్తులు, లేని అవ్యయములు. అవ్యయము పూర్వపదముగా కలది అవ్యయీ భావ సమాసము.

యథావిధి - ప్రతిదినము - ఇందు

యథా - ప్రతి అనునది అవ్యయములు.

యథావిధి - విధి నతి క్రమింవక.

ప్రతిదినము - దినము, దినము.

ప్రత్యహము - అహము, అహము.

అని విగ్రహము చెప్పు కొనవలెను.

ఈ సమాసము తెలుగునలేదు.

## ప్రశ్నలు

1) సమాసమనగానేమి? శబ్దము ననుసరించి సమాసము లెన్ని రకములు? అవియేవి?
2) ఆచ్ఛిక సమాసమును సోదాహరణముగ తెల్పుము?
3) అర్థ భేదమును బట్టి సమాసము లెన్ని రకములు? అవియేవి?
4) అవ్యయీభావ సమాసమనగానేమి? సోదాహరణముగ తెల్పుము?
5) ఈక్రింది సమాసము లేవో తెల్పుము.

   1) కడతల 2) నెలతాల్పు 3) గుణహీనుడు 4) మాటనేర్పరి
   5) కపోత వృద్ధము 6) గంగానది 7) గాజులసెట్టి
   8) ద్వైమాతురుడు 9) రామకృష్ణులు 10) పద్మాలయ

# 5. ఛందో విభాగము

**I ఛందశ్శాసనము :**

లఘు - గురువులు - నిర్ణయము. గణములు- కూర్పు
సూర్య చంద్రగణములు-
యతి - ప్రాసలు..

**II. జాతులు – ఉపజాతులు – వృత్తములు**

**జాతులు :**

1. కందము
2. ద్విపద
3. తరువోజ
4. ఉత్సాహము
5. మధ్యాక్కర

**ఉపజాతులు :**

1. తేటగీతి
2. ఆటవెలది
3. సీసపద్యము

**వృత్తములు :**

1. ఉత్పలమాల
2. చంపకమాల
3. శార్దూలము
4. మత్తేభము
5. మత్తకోకిల
6. తరలము
7. వంచచామరము
8. మానిని
9. మాలిని
10. స్రగ్ధర

**ఇతర ముఖ్య పద్యలక్షణములు :**

1. మహాస్రగ్ధర
2. సుగంధి
3. స్రగ్విణి
4. లయగ్రాహి
5. లయవిభాతి
6. లయహారి
7. మంజరి
8. సరసిజము
9. క్రౌంచపదము
10. మహాక్కర
11. మధురాక్కర
12. అంతరాక్కర
13. దండకము
14. మంగళమహాశ్రీ

# ఛంద పరిచ్ఛేదము

షడంగములలో ఛందశ్శాస్త్ర మొకటి. ఛందస్సు అనగా పద్య లక్షణము. పద్య లక్షణమును తెల్పు శాస్త్రమును ఛందశ్శాస్త్ర మందురు.

కొన్ని అక్షరములు చేరి గణములగును.
కొన్ని గణములు చేరి యొక పద్యమగును.
గురు లఘువుల కలయికచే గణము లేర్పడును.

హ్రస్వాక్షరములు, లఘువులు (తేల్చి పలుకునవి)
దీర్ఘాక్షరములు, గురువులు (ఊది పలుకునవి) ఒక క్షణములో నాల్గవ భాగము మాత్ర.

ఒక మాత్ర కాలము లఘువు.
రెండు మాత్రల కాలము గురువు.
మూడు మాత్రల కాలము ప్లుతము.
లఘువును 'I' ఈ గుర్తుతో చూపుదురు.
గురువును 'U' ఈ గుర్తుతో చూపుదురు.

**గురువుల గుర్తించు విధానము :-**

1. దీర్ఘములన్నియు గురువులు.
   కా - రా - పా. మొదలైనవి.
2. బిందువుతో కూడినవి గురువులు.
   కం - రం - పం మొదలైనవి.
3. విసర్గముతో కూడినవి గురువులు.
   కః - దుః మొదలైనవి.

4. పొల్లు హల్లులతో గూడినవి గురువులు.
కన్ - రన్ - మన్ మొదలైనవి.

5. ఐ - ఔ లతో గూడినవి గురువులు.
కై - రై - రౌ - పౌ మొదలైనవి.

6. ద్విత్వాక్షరమునకు, ముందున్నవి గురువులు.
అడ్డము - గుఱ్ఱము
ఇందు అ - గు - గురువులు.

7. సంయుక్తాక్షరమునకు ముందున్నవి గురువులు.
రక్తము - ధర్మము
ఇందు - ర - ధ గురువులు.

మిగిలినవి లఘువులు.

సిద్ధ సమాసము అందు మాత్రము, ఉత్తర పదము మొదట నున్న హల్లుల సంయోగము, పూర్వపదము తుది అక్షరమునకు గురుత్వము కల్గింపగలదు.

శక్ర (శ్రీ) కిన్ - ఇది సిద్ధ సమాసము.

ఇందు ఉత్తరపదము మొదటి అక్షరమగు (శ్రీ) అనుహల్లుల సంయోగము పూర్వ పదాంత అక్షరమగు, క్ర అనుదానికి గురుత్వము కల్గింప జాలినది.

సాధ్య ఆది అన్యసమానమునకు అట్లు కాదు.

శక్రుని (శ్రీ)కిన్ - ఇది సాధ్య సమాసము.

ఇందు ఉత్తర పదాద్యక్షరమగు (శ్రీ) అను హల్లుల సంయోగము పూర్వ పదాంతాక్షరం మగు 'ని' అనుదానికి గురుత్వము కల్గింపదు.

చెట్టు ప్రకాండము - ఇది మిశ్ర సమాసము.

ఇందు 'ప్ర' హల్లుల సంయోగము 'ట్టు' అను దానికి గురుత్వము కల్గింపదు.

గురువును -'గ' అని, లఘువును 'ల' అని గుర్తింతురు.

రెండు అక్షరముల గణములు 4.

గగము : UU రామా

లలము : II రమ

హగణము : లేక గలము
UI రామ

వగణము : లేక లగము
IU రమా

మూడక్షరముల గణములు ; 8(నిసర్గ గణములు)

యమాతారాజభానస -

ఒక్కొక అక్షరము ఒక్కొక గణము పేరు దెల్పును.

| | | | |
|---|---|---|---|
| యమాతా | = | I U U | - యగణము |
| మాతారా | = | U U U | - మగణము |
| తారాజ | = | U U I | - తగణము |
| రాజభా | = | U I U | - రగణము |
| జభాన | = | I U I | - జగణము |
| భానస | = | U I I | - భగణము |
| నసయ | = | I I I | - నగణము |
| సయమా | = | I I U | - సగణము |

'' ఆది మధ్యావసానేషు యరతా
యాంతిలాఘవమ్
భజసాగౌరవం యాంతి మనౌతు
గురు లాఘవౌ ''

య - ర - త గణములకు వరుసగా ఆది-మధ్య-అవసానము లందు, లఘువులును,-భ-జ-స లకు వరుసగా, ఆది-మధ్య-అవసానములందు గురువును, ఉండును. మ-న గణములలో మొదటిది కేవలము గురువుతోను, రెండవది కేవలము లఘువుతోను ఏర్పడునని పై శ్లోకమునకు భావము.

**నాలుగక్షరముల గణములు. 3**

నగణముపై లఘువు. నలము.

III + I = నరసము.

నగణముపై గురువు - నగము.

III + U = నరసుడా।

నగణముపై లఘువు - సలము.

IIU + I = రఘురామ।

**గణముల సంఖ్య**

రెండక్షరముల గణములు - 4

మూడక్షరముల గణములు - 8

నాల్గక్షరముల గణములు - 3.

మొత్తము పదునైదు గణములు

**సూర్యచంద్ర ఇంద్ర గణములు।**

'' భ, ర, త, నగ నల సలంబులు
వరుసగ నీయాఱునెన్నవా నవ గణముల్
మఱి,న,హ,ము లి న గణంబులు.
సరి విందక్కినవియెల్ల, చంద్ర గణంబుల్.

భగణము - రగణము - తగణము - నగము - నలము - సలము - ఈ ఆఱును ఇంద్రగణములు.

నగణము, - హగణములు - సూర్యగణములు.

మిగిలిన గణము - లలము, వగణము - జగణము - నగణము - యగణము - మగణములు చంద్రగణములు.

**పద్యములు వృత్తములు - జాతులు - ఉపజాతులని మూడు విధములు.**

నిసర్గ గణములతో నేర్పడునవి వృత్తములు. దీనికి యతి - ప్రాసనియములు- పాద- అక్షర నియమముండును. ఇట్టివి చంపకమాల- ఉత్పలమాల మొదలైనవి.

**జాతులు :** ఇందు ప్రతిపాదములోని గణములు నియతములు. కాని క్రమమునకు నియతముండదు.
కందము - ద్విపద మొదలైనవి జాతులు.

మొదటి పాదము మొదటి అక్షరము గురు లఘువులలోనేదియున్నను చివరి వరకు అట్లే యుండవల యును.

**ఉపజాతులు :** వీటికి ప్రాస నియమము కూడ లేదు. యతిగాని ప్రాసయతిగాని వేయవచ్చును. ఆటవెలది - తేటగీతి - సీసపద్యము ఈ కోవకు చెందినది.

**ప్రాసము :** ప్రాసమనగా పాదములోని ద్వితీయాక్షరము. ఇందుహల్లు సమానముగా మన్న చాలును. అచ్చుదేనితో కూడియున్న నుండవచ్చును, అనగా మొదటి పాదమున ప్రాసాక్షరము 'కి' యున్నచో తక్కిన పాదములలో 'క' గుణింతములోని ఏఅక్షరమైన ఉండవచ్చును. మొదటి పాదమున ప్రాసాక్షరము, గురువైనచో తక్కిన పాదములందు కూడ గురువే యుండవలయును. లఘువైన లఘువే యుండవలయును. సంయుక్తాక్షరమైన- ద్విత్వాక్షరమైన- బిందుపూర్వకాక్షరములైన- అవే యుండవలయును.

ఉదాహరణములు -

కాలము మంచిదై విరివిగా తెగ పండిన పైరుపంటలే
చాలవు పొట్టకూటికయిటే స్వర్గమునందు వసించువారికిన్

ఇందు 'ల'కారప్రాసము. లఘువు.

ఏడీ మీ ప్రభువేడి? దేవగిరియందే గద్దెలై దీర్చియు న్నాడా! యాలము పెండ్లి తొందరల నున్నాడా! మముం జూడగా!

ఇందు 'డ' కారము ప్రాస- గురువు.

చిందఱ రేగి, శత్రువుల చివ్వనెదిర్చుచు, వీర బృందముల్ గ్రిందులు జేసి, యాంధ్రమున, గేవలమేలితి నింతదాక, పేరంది,
- ఇందు బిందుపూర్వక ద కారము.

ఆశ్వయుజంబు వచ్చె, శరదంబుదముల్ వెలవెల్లబారె, భూ మీశ్వర! దండయాత్రలకు నియ్యది మేలగువేళ గాని, దీ ల్లీశ్వర!

ఇందు సంయుక్తాక్షరమైన
'శ్వ' ప్రాసాక్షరము.

మొన్నటి కావ్యగాధ తల పోతకు వచ్చెడి-మా గురూత్తముల్,
పన్నిన, గబ్బమంచు, గొనివచ్చిరి, యిర్వురు, దాని తీరుమే
మెన్నక-

ఇందు ద్విత్వాక్షరమైన 'న్న'కారము ప్రాసగా వచ్చినది.

ఇదే విధముగా ప్రాసాక్షరమునకు హల్ మైత్రి యుండవలెను గాని అచ్చు మైత్రితో పనిలేదు.

యతులు : పద్యపాదము యొక్క మొదటి అక్షరముతో నాపద్యమునకు నిర్ణయింపబడిన స్థానమందలి, యక్షరము, మైత్రికలిపి యుండుట యతిమైత్రి యనబడును.

ప్రాసయతి : యతిమైత్రికి బదులుగా పాదమందలి రెండవ అక్షరమునకును యతిస్థానము తరువాతి అక్షరమునకును ప్రాసమైత్రి కల్పించుటకు ప్రాసయతియనిపేరు. యతిమైత్రి అచ్చునకు, హల్లునకు రెండింటికి వేరువేరుగా సరిపడవలయును. ప్రాసమైత్రి హల్లునకే సరిపడవలయును. కాని అచ్చులకు మైత్రి అవసరములేదు.

ప్రాసలేని పద్యములుండును గాని యతి లేని పద్యములుండవు. యతికి, విశ్రాంతి, విరతి, విరయము, వళి అనుపేర్లు కలవు. యతికి స్వర ప్రధానము. అనగా పాద ప్రథమాక్షరమునకు, ఆయా నియమిత, యతిస్థానమునందలి అక్షరమునకు హల్ మైత్రితో బాటు స్వరమైత్రి కూడ ఉండవలెను.

## యతిమైత్రి.

అచ్చులు :

1) అ - ఆ; ఐ - ఔ -ం, - (య - హ)
2) ఇ - ఈ; ఋ - ౠ; ఎ - ఏ
3) ఉ - ఊ; ఒ - ఓ

హల్లులు :

1) క - ఖ - గ - ఘ
2) చ - ఛ - ఛ - జ - జ - ఝ
   శ - ష - స
3) ట - ఠ, డ - ఢ
4) త - థ, ద - ధ

5) ప - ఫ, బ - భ
6) ల - ళ
7) న - ణ
8) ఱ - ర
9) మ
10) పు - వు, బు - భు, ము
ఇతర యతి విశేషములు గ్రహించవలెను.

## పద్య లక్షణములు :

### జాతులు :

**1. కందము లక్షణము :**

'' కందము, త్రిశరగణంబుల,
నందముగా, భ-జ-స-న-ల-ము లటవడిమూటల్,
బొందును-నల-జల-నాజీట
నొందుం, దుది గురువు, జగణ ముండదు బేసిన్
వృత్తముల వలె దీనికి ప్రాసనియమము కలదు.'

1) భ - జ - స - నల - గగ అను చతుర్మాత్రా గణములను కలిగియుండును.

2) 1-3 పాదములు 2-4 పాదములు సమానము.

3) రెండు, నాలుగు, పాదములలో, పైనుజెప్పబడిన చతుర్మాత్రా గణములలో, ఏ ఐదు గణములైన నుండవలయును, ఒకే గణమైదుసార్లు వచ్చినను రావచ్చును, లేదా వేరు వేరు గణము లేదైన నుండవచ్చును.
1-3 పాదములలో పైవానిలో ఏగణములైన నుండవచ్చును.

4) ఒకటి-రెండుపాదములు కలిసి మొత్తము ఎనిమిది గణములలోను బేసి స్థానమున జగణముండరాదు. రెండు నాలుగు పాదములలో మూడవ గణము తప్పక జగణముగాని, నలముగాని అయి యుండవలెను.

5) రెండు-నాలుగు పాదములలో మొదటి అక్షరమునకు, నాలుగవ గణము మొదటి అక్షరము యతి స్థానము. 1-3 పాదములలో యతిమైత్రి యుండదు.

6) రెండు-నాలుగు పాదములకు, చివర గురువుగల గణము మాత్రమే, యుండవలెను. అనగా భ-జ-నలములు పనికిరావు. నగణము-గగములలో నేదైన ఉండవలెను.

ఉదా :

| గగ | నల | భ |
|---|---|---|
| UU | I I I I | U I I |
| శ్రీరా | ముని దయ | చేతను |

| గగ | నల | నల | గగ | నగ |
|---|---|---|---|---|
| UU | I I I I | I I I I | UU | I I U |
| నారూ | ఢిగనక | లజనులు | నౌరా | యనగా। |

రా - రూ - ప్రాసాక్షరములు.

ఆ - ఔ - యతి స్థానాక్షరములు.

## 2. ద్విపద - లక్షణము :

ఇంద్రగణములు మూడు, ఇన గణంబొకటి
చంద్రాస్య। ద్విపదకు జనురెంటవిరతి '

ఇందు రెండు పాదములు మాత్రముండును.

ప్రతిపాదమునకు, మొదటి మూడు ఇంద్ర గణములు, తరువాత ఒక సూర్యగణ ముండును.

మూడవ గణము, మొదటి అక్షరము యతి స్థానము.
ప్రాస నియమముండును.
యతికి బదులుగా ప్రాస యతి పనికిరాదు.
ప్రాస నియమములేకుండ ఎన్నిపాదములైన చెప్పినచో మంజరీ ద్విపదయగును.

ఉదా :

| నల | నల | ర | హ |
|---|---|---|---|
| I I I I | I I U I | U I U | U I |
| సురపతి | త్రితయంబు | సూర్యుడా | క్కుండు |
| నల | నగ | త | హ |
| I I I I | I I I U | U U I | U I |
| బరగును | ద్విపదయన్ | పదంబు | నందు |

ప్రాస - ర - ర
యతి - సు - సూ; ప - ప

**తరువోజ - లక్షణము :**

మూడింద్ర గణములు - ఒక సూర్యగణము. మరల మూడింద్ర గణములు, 1 సూర్య గణము కలిసి ఒక పాదమగును. మూడు-ఐదు-ఏడు గణముల మొదటి అక్షరములు యతి స్థానములు.

ఉదా :

| త | ర | నల | హ |
|---|---|---|---|
| U U I | U I U | I I U I | U I |
| భూనాథ | నీ గుణం | బులు హంస | చేత |

| నగ | నగ | సల | హ |
|---|---|---|---|
| I I I U | I I I U | I I U I | U I |
| బొలుపుగా | వినిమనం | బున నిల్పి | యున్న |

మొదటి అక్షరము 'భూ' అనుదానికి, మూడు ఐదు - ఏడు గణముల మొదటి యక్షరమయిన బు - బొ - బు - అనువానికి యతిమైత్రి సరిపడినది.

**4. ఉత్సాహము – లక్షణము :**

వరుసగా ఏడు సూర్య గణములు, ఆపై ఒక గురువుండును. 5వ గణము మొదటి అక్షరము యతిస్థానము. ప్రాసనియమము కలదు.

ఉదా :-

| హ | నగ | నగ | హ | హ | నగ | హ | |
|---|---|---|---|---|---|---|---|
| U I | I I I | I I I | U I | U I | I I I | U I | U |
| పోలు | ననుచు | పెరిగి | రాజ | పుత్రు | లదిగి | యార్చ | పం |

| హ | నగ | హ | నగ | హ | నగ | హ | |
|---|---|---|---|---|---|---|---|
| U I | I I I | U I | I I I | U I | I I I | U I | U |
| చాలు | పురము | ముట్టి | కొనిరి | సంఖ్య | బలన | మేతు | లై |

మొదటి పాదములోని మొదటి అక్షరము 'పో'కును- అయిదవ గణములోని 'పు'కును యతి చెల్లినది. అట్లే రెండవ పాదములోని 'చా'కును 'సం'కును యతి చెల్లినది.

5. మధ్యాక్కర - లక్షణము :

2 ఇంద్ర గణములు 1 సూర్యగణము. 2 ఇంద్రగణములు, 1 సూర్యగణము. ఈవిధమున వరుసగా ప్రతి పాదమున ఆరు గణములుండును. ఐదవ గణము మొదటి అక్షరము యతి స్థానం.

ఉదా :

| నగ | ర | హ | త | త | నగ |
|---|---|---|---|---|---|
| I I I I | U I U | U I | U U I | U U I | I I I |
| నరసుర | స్తుత్య మై | యెంత | కాలంబు | నా కీ ర్తి | నిలుచు |

న - నా - యతి - చెల్లినది

## ఉపజాతులు

సూర్యగణములు, ఇంద్ర గణములు కలిగి యతితో కూడి యుండును. ప్రాస నియమము లేదు. ప్రాస యతి వేయవచ్చును.

1. తేటగీతి - లక్షణము :

'' సూర్యుడొక్కరుండు రరాజు లిద్దరు
దిన కరద్వయంబు తేటగీతి ''

నాలుగు పాదములు సమానములు. ప్రతిపాదమునను, మొదట ఒక సూర్యగణము, తరువాత రెండు ఇంద్రగణములు, తరువాత రెండు సూర్యగణములు ఉండవలెను. నాల్గవ గణము మొదటి అక్షరము యతి స్థానము.

ఉదా :

| హ | ర | ర | హ | హ |
|---|---|---|---|---|
| U I | U I U | U I U | U I | U I |
| చిత్ర | చిత్ర స్వ | భావ దా | క్షిణ్య | భావ |

చి - క్షి - యతి చెల్లినది.

**2. ఆటవెలది - లక్షణము :**

" ఇన గణత్రయంబు, ఇంద్ర ద్వయంబును
హంస పంచకంబు, ఆటవెలది.

1-3 పాదములు-2-4 పాదములు సమాన లక్షణములు కలిగియుండును. 1-2 పాదములకు కలిపి లక్షణము చెప్పుకొనవలెను. మొదటి పాదమునకు ముందు మూడు సూర్యగణములును, తరువాత రెండు ఇంద్రగణములు నుండును. రెండవ పాదమునకు వరుసగా ఐదు సూర్యగణము లుండును, మూడు నాల్గు పాదములు ఒకటి రెండు పాదములతో సమానము. నాల్గుపాదములం దును నాలుగవ గణము మొదటి అక్షరము యతిస్థానము.

ఉదా :

| హ | హ | హ | ర | సల |
|---|---|---|---|---|
| U I | U I | U I | U I U | I I U |
| ఉప్పు | కప్పు | రంబు | నొక్కపో | లికనుండు |

| హ | హ | న | హ | హ |
|---|---|---|---|---|
| U I | U I | I I I | U I | U I |
| చూడ | చూడ | రుచుల | జాడ | వే రు |

ఉ - ఒ - యతి

చూడ - జాడ - ప్రాసయతి.

### 3. సీసపద్యము - లక్షణము :

ఇంద్రగణము లారు, నిన గణంబులు రెండు
పాదపాదమునకు బరుగుచుండు
ఆట వెలదియైన, తేటగీతియునైన,
చెప్పవలయు మీద, సీసమునకు.

వరుసగా ఆఱు ఇంద్రగణములు, తరువాత రెండు సూర్యగణములు గల నాల్గుపాదములు చెప్పి ఆమీద ఒక తేట గీతిగాని, ఆటవెలదిగాని చేర్చవలయును.

మొదటి నాలుగు పాదములలోను ఒక్కొక్కటి రెండేసి చరణములగును. అనగా మొదటి చరణమునకు నాలుగింద్ర గణములుండును. రెండవ చరణమునకు మొదటి రెండు ఇంద్రగణములు తరువాత రెండు సూర్యగణములు నుండును. రెండు చరణములకు వేర్వేరు యతియుండును. చరణము యొక్క మొదటి అక్షరము మూడవ గణముయొక్క మొదటి అక్షరముతో యతిమైత్రి కలిగియుండును. ప్రాసయతి వేయవచ్చును.

ఉదా :-

| త | ర | నల | త |
|---|---|---|---|
| U U I | U I U | I I U I | U U I |
| రాకేందు | బింబమై | రవిబింబ | మైయొప్పు |

| ర | భ | హ | హ |
|---|---|---|---|
| U I U | U I I | U I | U I |
| నీరజా | తేక్షణ | నెమ్మొ | గమ్ము |

ఇందు మొదటి పాదమున మొదటి అక్షరము ' రా 'కును మూడవ గణము మొదటి అక్షరము ' ర 'కును యతి చెల్లినది.

రెండవపాదమున మొదటి అక్షరము ' నీ ' కిని అందలి మూడవ గణము మొదటి అక్షరము ' నె 'కును యతి మైత్రి చెల్లినది.

**విశేషాంశము :** గణముల నియమమును బట్టి పాదములు సమానములే అయినప్పటికిని, ఈ గణము అని నిర్దేశము లేక సూర్యగణములు చంద్రగణములు నని చెప్పబడినందున-కొన్ని సూర్యగణములు రెండక్షరములనియు, కొన్ని మూడక్షరములన్నియు, అట్లే కొన్ని యింద్ర గణములు, మూడక్షరములనియు కొన్ని నాలుగక్షరములవియునై యుం డుట చేత, పాదములయందలి అక్షరముల సంఖ్యలో భేదము వచ్చును. కావుననే యతి స్థానము యున్నవ అక్షరమనిగాక యున్నవ గణము మొదటి అక్షరమని చెప్పబడుచున్నది.

## వృత్తములు

| పేరు | గణములు | యతి | మొదటి గణము | అక్షరములు |
|---|---|---|---|---|
| ఉత్పలమాల | భ ర న భ భ ర వ | 10 | భ | 20 |
| చంపకమాల | న జ భ జ జ జ ర | 11 | న | 21 |
| శార్దూలము | మ స జ స త త గ | 13 | మ | 19 |
| మత్తేభము | స భ ర న మ య వ | 14 | స | 20 |
| మత్తకోకిల | ర స జ జ భ ర | 11 | ర | 18 |
| తరలము | న భ ర స జ జ గ | 12 | న | 19 |
| పంచచామరము | జ ర జ ర జ గ | 10 | జ | 16 |
| మానిని | భ భ భ భ భ భ భ గ | 13 | భ | 22 |
| మాలిని | న న మ య య | 9 | న | 15 |
| స్రగ్ధర | మ ర భ న య య య | 8,15 | మ | 21 |

**1. ఉత్పలమాల :**

" భాను సమానవిన్ భ, ర, న, భా, ర, ల, గం, బు, ల గూడి విశ్రమ స్థానమునందు, పద్మజయుతంబుగ, నుత్పలమాల యై చనున్, "

భ, ర, న, భ, భ, ర, వ, (లగము) లు వరుసగా నుండి 10వ స్థానమున యతి చెల్లిన ఉత్పలమాల యగును.

ఉదా :

| భ | ర | న | భ |
|---|---|---|---|
| U I I | U I U | I I I | U I I |
| నీవుజ | నించిన | ట్టి న్మర | ణీయ ది |

| భ | ర | వ |
|---|---|---|
| U I I | U I U | I U |
| నంబది | విశ్వశాం | తికిన్ |

యతి - నీ - ణీ - ప్రాస ' వు '

అక్షరములు 20. పాదములు నాలుగు.

**2. చంపకమాల :**

న జ భ జ జ జ ల్, జరేఫల,, బెనంగ, దిశాయతి తోడ కూడినన్

త్రిజగదభిస్తు తా। బుధనిధీ। విను చంపకమాల యైచనున్;

న జ భ జ జ జ ర అను గణములు వరుసగానుండి, 11వ స్థానమున యతి చెల్లిన, చంపకమాల పద్యమగును. పాదమున అక్షరములు 21. పాదములు 4.

ఉదా :

| న | జ | భ | జ |
|---|---|---|---|
| I I I | I U I | U I I | I U I |
| కదలె | నుకార్మి | కుందుక | లకాల |

| జ | జ | ర |
|---|---|---|
| I U I | I U I | U I U |
| మునూడి | గమాచ | రించినం |

యతి క - కా - ప్రాస - ద.

3. శార్దూలము :

సారాసారవిశారదా। యిన యతిన్, శార్దూలవిక్రీడితా
కారంబై, మన జమ్ముల్ లిమ్ముగ, నతాగప్రాప్తమై చెల్వగున్.

మ, స, జ, స, త, త, గ, అను గణములు వరుసగ నుండి, పదమూడవ, అక్షరమున, యతిచెల్లిన శార్దూలమ గును. అక్షరములు 19.

ఉదా :

| మ | స | జ | స |
|---|---|---|---|
| U U U | I I U | I U I | I I U |
| భిన్నత్వం | బున, నే | కనూత్ర | మును, భా |

| త | త | గ |
|---|---|---|
| U U I | U U I | U |
| వించెన్ క్రి | యాశీల | నం |

యతి - భి - వి - 1 - 13. ప్రాస 'న్న'.

4. మత్తేభము :-

స్మయదూరా! విలస త్రయోదశ యతిన్ మత్తేభ వి క్రీడితా
హ్వయమయ్యెన్, సభరమ్ములున్, నమయవ వ్రాతంబులున్ గూడగాన్.

న, భ, ర, న, మ, య, వ - అనుగణములు వరుసగా నుండి, 14 వ అక్షరము యతి చెల్లిన, మత్తేభము. అక్షరములు 20.

ఉదా :

| న | భ | ర | న |
|---|---|---|---|
| I I U | U I I | U I U | I I I |
| మహిళా | మండలి | కీవునే | తవయి |

| మ | య | వ |
|---|---|---|
| U U U | I U U | I U |
| నన్మానం | బులన్గాం | చియా |

యతి - మ - న్మా - ప్రాస - హి.

5. మత్తకోకిల :

శ్రావకాభరణాంక! విన్ రసజాభ రేఫలదిగ్విరా.
మావహంబుగ, మత్తకోకిల యండ్రు, దీని కవీశ్వరుల్;

ర, స, జ, జ, భ, ర - అను గణములు వరుసగా నుండి 11 వ అక్షరము, యతి చెల్లిన మత్తకోకిల. అక్షరములు 18.

ఉదా :

| ర | స | జ |
|---|---|---|
| U I U | I I U | I U I |
| స్నాతకుం | డునుబు | త్విజుండు |

| జ | భ | ర |
|---|---|---|
| I U I | U I I | U I U |
| నుసర్గు | ణుండును | నిష్టుడున్ |

యతి - స్నా - స - 1 - 11 ప్రాస - త.

**6. తరలము :**

ప్రవర, రుద్రవిరామయుక్తి నభంబులన్, రసజాగముల్
కవిజనాశ్రయ। పొందియందముగా ధరందరలంబగున్.

న, భ, ర, స, జ, జ, గ అను గణములు వరుసగా నుండి, 12వ అక్షరము యతి చెల్లిన తరలమగును. అక్షరములు 19.

ఉదా :

| న | భ | ర | స |
|---|---|---|---|
| I I I | U I I | U I U | I I U |
| ధరణి | లోగల | రాజులె | ల్లరుదా |

| జ | జ | గ |
|---|---|---|
| I U I | I U I | U |
| రుణక్ష | యకాల | సా |

యతి - ధ - దా - 1 - 12. ప్రాస - ర.

7. పంచచామరము :

జరల్, జరల్, జగంబు, గూడ, నన్నుతిన్ రచింపగా,
బరాజి తారివీర। పంచచామరంబగున్, వెసన్

జ, ర, జ, ర, జ, గ అను గణములు వరుసగా నుండి 10వ అక్షరము యతి చెల్లిన వంచచామరము. అక్షరములు 16.

ఉదా :

| జ | ర | జ | ర | జ | గ |
|---|---|---|---|---|---|
| I U I | U I U | I U I | U I U | I U I | U |
| కిరాత | రాతలం | పుహత్తి | కేవలం | బుభుక్తి | మై |

యతి - కి - కే. ప్రాస ' రా '

8. మానిని :

కారకముల్ క్రియగన్గొన, నేడు భకారము లొక్కగ కారముతో,
గారవమైచనగా, వళులన్నియు గల్గిన, మానిని కామనిభా।

భగణములు ఏడు వరుసగానుండి చివర ఒక గురువున్న మానిని వృత్తము. యతి 13వ అక్షరము. అక్షరములు 22.

ఉదా :

| భ | భ | భ | భ |
|---|---|---|---|
| U I I | U I I | U I I | U I I |
| చూచుచు | వీనుల | కింపెన | గన్విను |

| భ | భ | భ | గ |
|---|---|---|---|
| U I I | U I I | U I I | U |
| చున్శుక | కోకిల | సుస్వర | ముల్ |

యతి - చూ - చున్ - ప్రాస - చు.

9. మాలిని :-

ననమయయ, యుతంబైనాగ విశ్రాంత మైయి
ట్లనుపమగుణ ! మాలిన్యాహ్వయంబయ్యె ధాత్రిన్

న, న, మ, య, య, అను గణములు వరుసగా నుండి, 9వ అక్షరము యతి చెల్లిన, మాలిని వృత్తమగును. అక్షరములు 15.

ఉదా :

| న | న | మ | య | య |
|---|---|---|---|---|
| I I I | I I I | U U U | I U U | I U U |
| సురప | తినభ | ంజూడంజూ | డనంగా | రవృష్టుల్ |

యతి సు - జూ - ప్రాస - ర.

10. స్రగ్ధర :-

శ్రీమన్మూర్తీ! మకారా శ్రి తరభనయయా సేవ్యమై సానుమద్వి
శ్రామంబున్ సానుమద్విశ్రమమున మరగాస్రగ్ధరావృత్తమ య్యెన్.

మ, ర, భ, న, య, య, య గణములతో కూడియుండి 8-15 అక్షరముల యతి చెల్లిన స్రగ్ధరావృత్తమగును. అక్షరములు 21 ఉండును.

ఉదా :

| మ | ర | భ | న |
|---|---|---|---|
| U U U | U I U | U I I | I I I |
| ధ్వాంతారా | తిప్రభుం | దైతన | రుచువె |

| య | య | య |
|---|---|---|
| I U U | I U U | I U U |
| లిగెన్త | ద్రణవ్యో | మవీధిన్ |

యతి - 1 - 8 - ధ్వాం - త

8 - 15 - త - త

ప్రాస బిందు పూర్వక తకారము.

ఈ పది వృత్తములకు చెప్పిన కొన్ని లక్షణ పద్యములు ఆయా పద్యగణములను, యతులను సూచించుచున్నవి అని గ్రహింపవలెను.

ఇతర ముఖ్య పద్య లక్షణములు.

1. మహాస్రగ్ధర :-

స, త, త, న, స, ర, ర, గ అను గణములు.

పాదమునకు 22 వర్ణములు. 6-16 యతి స్థానము.

2. సుగంధి :-

7 హగణములు వరుసగా ఉండును. చివర ఒక గురువుండును. 9వ వర్ణము యతి స్థానము.

3. స్రగ్విణి :-

నాలుగు రగణములు వరుసగా నుండును. 12 వర్ణములుండును.

7వ వర్ణము యతి.

4. లయగ్రాహి :

పాదమునకు 39 మాత్రలు గల 30 అక్షరములుండును. అనగా భ - జ - స - న - భ - జ - స - న - భ - య - 9-17-25 అక్షరములు ప్రాస యతులుండవలెను.

5. లయవిభాతి :-

పాదమునకు 34 మాత్రలు గల 34 అక్షరములుండును. అనగా న - న - న - న - న - న - న - న - న - న - న - గ - 10-19-28 ప్రాస యతులుండవలెను.

6. లయహారి :-

పాదమునకు 39 మాత్రలుగల 37 వర్ణములుండవలెను. అనగా 11 నగణములు 1 నగణము 1 గురువు. 11-21-31 ప్రాస యతులు.

7. మంజరి :-

3 ఇంద్రగణములు 1 సూర్యగణమునుండి మూడవగణము మొదట యతిగలది. దీనికి ప్రాసముండదు.

8. సరసిజము :-

మ - త - య - న - న - న - న - స గణములుండును. 10-18 వర్ణములు యతి స్థానములు.

9. క్రౌంచపదము :-

భ - మ - స - భ - న - న - న - య అనుగణములుండును. 11-19 యతిస్థానములు.

10. మహాక్కర :-

1 సూర్యగణము, 5 ఇంద్రగణములు, 1 చంద్రగణము. ఇట్లు 7 గణములుండును. 5 వ గణము మొదట యతి ప్రాసనియమముండును.

11. మధురాక్కర :-

పాదమునకు 1 సూర్యగణము, 3 ఇంద్రగణములుండును.

1 చంద్రగణములు మొత్తము 5 గణములుండును. 4 వగణము మొదట యతి స్థానము ప్రాసముండును.

**12.** అంతరాక్కర :-

పాదమునకు 1 సూర్యగణము, 2 ఇంద్రగణములు, 1 చంద్రగణముండును. 4వ గణము మొదట యతి ప్రాసముండును.

**13.** దండకము :-

మొదట - న - స - హ - ములలో నొకదానిని గాని, తగణమునుగాని, కూర్చి చివరవరకు తగణము లను, చివర గురువును, చేర్చవలెను. ఇష్టమైనంత వ్రాసి కొనవచ్చును.

**14.** మంగళమహాశ్రీ :-

పాదమునకు 26 అక్షరములు. 9-17 వర్ణములు యతులు. భ - జ - స - న - భ - జ - స - న - గ - గ ములుండును.

## వృత్తములమార్పు :

ఉత్పలమాల యందలి, మొదటిగురువును, రెండు లఘువులుగా, మార్చినచో చంపకమాల యగును.

చంపకమాల యందలి, మొదటి రెండు లఘువులను ఒక గురువుగా మార్చిన అది ఉత్పలమాల యగును.

శార్దూలమందలి, మొదటిగురువును రెండు లఘువు లుగా, మార్చిన అది మత్తేభమగును.

మత్తేభమందలి, రెండు మొదటి లఘువులను, ఒకగురువుగా, మార్చిన అది శార్దూలమగును.

మత్తకోకిల, లోని మొదటి గురువును, రెండు లఘువులుగా, మార్చిన అది తరళమగును.

తరళము మొదటి రెండు లఘువులను ఒక గురువుగా మార్చిన, నది మత్తకోకిల యగును.

ద్విపద యొక్క పాదమును రెట్టించి అనగా రెండు ద్విపదపాదముల నొక్క పాదముగా చేర్చి 3-5-7 గణముల మొదటి అక్షరములకు యతికల్పించినచో నది తరువోజ యగును.

తరువోజ పాదమును రెండు సమభాగములుగా చేసిన, నది ద్విపదయొక్క రెండు పాదములగును.

## ప్రశ్నలు.

1) గురు లఘువునెట్లు గుర్తింతువు ?
2) యతి - ప్రాసల గూర్చి వ్రాయుము ?
3) సూర్య - చంద్ర - ఇంద్ర గణములేవో వివరింపుము.
4) పద్యము లెన్ని రకములు ? అవి యేవి ?
5) ఉపజాతుల లక్షణములేవి ?
6) ఈ క్రింది పద్యములకు లక్షణములు దెల్పుము.
   1) శార్దూలము (2)మత్తకోకిల (3) స్రగ్ధర (4) మహాస్రగ్ధర
   (5) తరలము (6) చంపకమాల (7) సుగంధి
   (8) మాలిని (9) ఆటవెలది (10) కందము.

# అలంకార పరిచ్ఛేదము

హారములు మొదలగునవి, మానవునకు సౌందర్యమును కల్గించును. అట్లే గద్య - పద్యాత్మకమైన కావ్యములకు, ఈ అలంకారములు సొగసు కలిగించి, ఆహ్లాదమును గూర్చును.

అలంకారములు రెండు విధములు.
అవి 1) శబ్దాలంకారములు. 2) అర్థాలంకారములు.

శబ్దమాత్ర ప్రధానమైనవి శబ్దాలంకారములు. అర్థవిశేషమును బట్టి వచ్చునవి, అర్థాలంకారములు.

**1. వృత్యను ప్రాసా లంకారము :**

ఒక హల్లు, అనేక పర్యాయములు, వచ్చునట్లు రచించిన, అది వృత్యను ప్రాసా లంకారము.

**ఉదా :** 1) పుండరీక, షండ మండితంబు.
2) వెడవెడ, బిడిముడి, తడబడ, నడుగిడు.
3) విష్ణు, రోచిష్ణు, కృష్ణు, సహిష్ణు, కృష్ణ.

మొదటి ఉదాహరణములో, బిందుపూర్వక డకారము, రెండవ దానిలో డకారము, మూడవ దానిలో 'ష్ణు' వర్ణము పలుమారులు ఆవృత్తములైనవి.

**2. ఛేకానుప్రాసము :**

రెండేసి హల్లులు, అర్థభేదము కలిగి, వ్యవధానము లేకుండ, ప్రయోగించబడినచో, ఛేకానుప్రాసము అందురు.

1) కందర్ప దర్పహరులగు, సుందర దరహాసరుచులు,
2) సుధాహరున్, హరున్.

రసాను గుణమగు ప్రకృష్టవర్ణ విన్యాసము అనుప్రాసమున నొప్పును. పలుకు కమ్మదనము నెరిగినవారు ఛేకులు. అట్టివారి కిష్టమైనది, కనుక నిది ఛేకాను ప్రాసము.

ఇందు దర్పదర్ప - దరదర అను వ్యంజనముల జంట అవ్యవధానముగా, ఆవృత్తమైనది.

**3. లాటానుప్రాసము :**

తాత్పర్యవిశేషము తోచుచు, శబ్దార్థములు పునరుక్తములైనచో, నది లాటాను ప్రాసము. నేటి గుజరాతులోని, మధ్యదక్షిణ ప్రాంతములు, పూర్వము లాటదేశమని, పిలువబడుచుండెను. ఆ దేశీయులకు, ఈ అలంకారము ఇష్టము. అందువల్ల ఈ అలంకారమునకు, ఈ పేరు కలిగిన దని కొందరు పండితుల అభిప్రాయము.

ఉదా : కమలాక్షు నర్చించు, కరములు, కరములు
శ్రీనాధు, వర్ణించు, జిహ్వ జిహ్వ
రెండవకరములు - జిహ్వ శ్రేష్ఠత్వమును దెలుపుచున్నవి.
ఆతని గుణములు గుణములు,
ఆతని యా కీర్తి కీర్తి, అమలంబగు, నాచాతురి చాతురి, యందురు.

ఖ్యాతయశుండైన, రుద్రుగాంచు కవీశుల్, రెండవసారి ప్రయోగింపబడిన గుణములు, కీర్తి - చాతురి, యుత్కృష్ట సూచకములు.

**4. యమకము :**

అర్థ భేదముగల, అక్షరముల సముదాయము, (అచ్చులు - హల్లులు కూడ) మరల మరల ప్రయోగించబడిన యెడల, యమకమనబడును.

**(I)** ఆమనికిన్, మనికియైన, యారామమునన్.

**(II)** లేమా! దనుజుల గెలువగ
లేమా! నీవేలకడిగి లేచితి, విటురా
లేమాను, మానలే, నా
లేమా! విల్లందు కొమ్ము లీలంలన్.

**i)** ఇచట పురము - మనికి అను అక్షరములు సమూహము, అర్థభేదముతో మరల వాడబడుట చేత నిది యమకాలంకారము.

**ii)** ఇందు లేమా, అను అక్షరముల సమూహము, అర్థభేదముతో, మరల మరల, ప్రయోగించుట చేత యమకాలంకారము.

ఛేకాను ప్రాసమునకు -యమకమునకు, భేదమేమన, యమకమున అక్షరముల సమూహము మరల మరల వచ్చుటలో వ్యవధానముండ వచ్చును. ఛేకాను ప్రాసమున నట్టి వ్యవధానము పనికిరాదు.

**5. ముక్త పదగ్రస్తము :**

విడిచిన, పదభాగముల, అవ్యవధానముగా, మరల గ్రహించుచు, రచింపబడిన యెడల, ముక్తపదగ్రస్తమగును. ముక్త = విడువబడిన, పద = పదమును, గ్రస్త = మరల గ్రహించుట అని అర్థము.

ఉదా: సుదతీ నూతన మదనా!

మదనాన, తురంగపూర్ణ మణిమయ సదనా!

సదనామయ, గజరదనా,

రదనాగేంద్ర నిభ కీర్తి, రస నరసింహా!

ఇందు - మదనా - సదనా - రదనా అను పదభాగములొక పదమున, వదలబడి, తరువాత పదమున, అవ్యవధాన ముగా గ్రహించబడినవి.

**6. అంత్యప్రాసము :**

పదాంతమున ప్రాసమున్న అంత్యప్రాసాలంకారము. శ్రీరఘురామ! చారుతులసీ దళధామ! శమక్షమాది శృంగారగుణాభిరామ! త్రిజగన్నుత శౌర్యరమా లలామ! దుర్వారక బంధరాక్షస విరామ! జగజ్జన కల్మషార్ణవో త్తారక నామ! భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ!

పదాంతమందున్న రామ - ధామ - అభిరామ - లలామ - విరామ - నామ - ఇంతవరకొక అంత్యప్రాసము.

దాశరథీ! కరుణాపయోనిధీ! ఇది యొక అంత్యప్రాసము.

అంత్యప్రాసమున్నదని పద్యమున, కుండవలసిన ప్రాసమును తొలగింపరాదు.

# అర్థాలంకారములు

## (1) ఉపమాలంకారము (Semile)

**లక్షణము :** ఒక వస్తువును, మరియొక ప్రసిద్ధమైన వస్తువుతో, పోల్చినచో, ఉపమాలంకారమగును.

**లక్ష్యము :** ఆమె ముఖము చంద్రబింబము వలె అందముగా నున్నది.

ఉపమాలంకారమునందు నాలుగు అంశములుండును.

1. ఉపమేయము, 2. ఉపమానము.
3. సమానధర్మము. 4. ఉపమావాచకము.

మనమేవిషయమును గురించి చెప్పుకొనుచుంటిమో, అది ఉపమేయము,

ఆమె ముఖము = ఉపమేయము.

మనమే ప్రసిద్ధమైన వస్తువుతో పోల్తుమో అది ఉపమానము. చంద్రబింబము.

ఆమె ముఖమునకు - చంద్రబింబమునకుగల

సమానగుణము - సమానధర్మము.

ఉపమా వాచకము - వలె.

ఉపమానపదములు - వలె - రీతి - వగిరి - వంటి - చందము - మొదలైనవి. ఈ నాల్గింటిలో ఏ ఒక్కటి లోపించినను లుప్తోమమాలంకారమగును. లోపించుట అనగా చెప్పు వాక్యము నందు లేకుండుట.

ఆమె చిగురుంకేలు నంటుకొంటివి.

చిగురువలె మెత్తని, కేలు (చేయి అని అర్థము) ఇందులో

వలె, అను, ఉపమావాచకము లేదు. మెత్తని అను సమానధర్మము లేదు. చిగురు అను ఉపమానము, కేలు అను ఉపమేయము. ఈ రెండే కలవు - కాన నిది లుప్తోపమ.

## (2) రూపకాలంకారము (Metaphor)

**లక్షణము :** ఉపమాన, ఉపమేయములు, రెండింటికి భేదము న్నను, భేదములేనట్లు చెప్పుట - (లేక) ఉపమేయ మునందు ఉపమానధర్మమును ఆరోపించుట, రూపకాలంకారము.

**లక్ష్యము :** లతాలలనలు రాజుపై కుసుమాక్షితలు చల్లిరి.

ఇందు లతలుపమేయము. లలన లుపమానము. కుసుమము లుపమేయము. అక్షతలు ఉపమానము. అక్షతలు చల్లుట ఉపమానములగు స్త్రీల ధర్మము. ఆపని ఉపమేయములైన లతలు చేసినట్లు వర్ణింపబడినది. రాజు ఉద్యానవనమునకు పోయినపుడు, లతలనుండి పువ్వులాతనిపై రాలినవని సారాంశము.

మరి కొన్ని ఉదాహరణలు :-
నీ వాగమృతమును, కర్ణపుటము లంద్రావితిమి.
ఈ కవి సాగరుని యందు సూక్తి రత్నములున్నవి.

విద్యాధనమును చోరులు దొంగిలింపలేరు.

## (3) అనన్వయాలంకారము.

**లక్షణము :** ఒక పదార్థమునే యుప మేయముగను ఉపమానము గను చెప్పుట.

లక్ష్యము : చంద్రుడు చంద్రుని వంటివాడు.
ఆకసమాకసము వంటిది.

## (4) ఉపమేయోపమ.

లక్షణము : ఉపమానమును, ఉపమేయముగను, ఆ ఉపమేయ మునే, ఉపమానముగను చెప్పుట.

లక్ష్యము : I. ధర్మము అర్థము వలెను, అర్థము ధర్మము వలెను, అలరారుచున్నది.
II. కొండవలె ఏనుగును, ఏనుగునట్లు కొండయు. నుండ,వాగువలె మదధారయు, మదధారవోలె వాగు నొప్పుచున్నవి.

## (5) అతిశయోక్తి (Hyper bole)

లక్షణము : లోక ప్రసిద్ధమైయున్న వస్తువు స్థితిని, అతిక్రమించి చెప్పుట అతి శయోక్తి అలంకారము. కవి ప్రౌఢోక్తియే దీనికి జీవనము.

లక్ష్యము : ఆ పురము నందలి సౌధములు మిన్నంటియున్నవి.

సౌధములు మిక్కిలి యున్నతములై యుండవచ్చును. అంతియేగాని మిన్నంటి యుండుట పొసగని కార్యము. కవి ప్రౌఢోక్తిచే, వస్తువు స్థితి అతిక్రమించి చెప్పుచున్నాడు.

## (6) దృష్టాంతరము.

లక్షణము : ఉపమేయముతోఉపమానమును బింబ ప్రతిబింబ భావముతో, దృష్టాంతీకరించుటయే, దృష్టాంతాలం కారమనబడును. ఇందు రెండు వాక్యములుండును.

లక్ష్యము: గుణము తెలియకుండినను సుకవి వాక్యము కర్ణ రసాయనముగానుండును. (ఉపమేయము)
పరిమళమును ఆఘ్రాణింపకుండినను మాలతీ కుసుమ మాలిక నేత్రపర్వముగా ఉండును గదా! (ఉపమానము)

ఈ రెండు వాక్యములందును కర్ణరసాయనముగా ఉండుట - నేత్రపర్వముగా నుండుట అనునవి విభిన్నధర్మములు. సహజముగా భిన్నములైన వానిని, ఇట సాదృశ్యముచే అభిన్నముగా వేర్వేరుగా చెప్పిరి.

దీనినే బింబప్రతిబింబ భావమందురు.

## (7) స్వభావోక్తి (Nature description)

జాతి, గుణ, క్రియాదులు, ఉన్నవియున్నట్లు మనోహరముగా, వర్ణించి చెప్పుట స్వభావోక్తి.

ఆ ఉద్యానవనమున, లేళ్లు చెవులురిక్కించి, చంచల నేత్రములతో, నిటునటు గంతులిడుచున్నవి.

ఇందు లేళ్లయొక్క స్థితి, మనోహరముగా, ఉన్నదున్నట్లు, వర్ణింపబడినది.

## (8) అర్థాంతరన్యాసాలంకారము (Corroboration)

విశేషమును సామాన్యముచేగాని, సామాన్యమును విశేషముచేతగాని, సమర్థించినచో అర్థాంతరన్యాసాలంకారమగును.

సామాన్యము = లోకోక్తి లేక లోకప్రసిద్ధి ధర్మము.
విశేషము = ప్రత్యేకమైన సంఘటన (incident)

**విశేషమును సామాన్యముచే సమర్థించుట.**

సత్యభామ శ్రీకృష్ణుని శిరమును దన్నెను.
కోపించిన స్త్రీలు ఉచితానుచితములను జూడరుగదా.

**సామాన్యమును విశేషముచే సమర్థించుట**

మంచివారల సంపర్కమువలన, అల్పవస్తువులు కూడ, గౌరవ మును పొందుచున్నవి.
పూవులతో కూడిన దారము కూడ శిరమున ధరింపబడుచున్న దికదా.

## (9) శ్లేషాలంకారము (Poronmasia)

అనేకార్థములు గల పదములు, నుపయోగించి చెప్పిన శ్లేషాలంకారము.

రాజు కువలయానంద కరుడు.

ఇచ్చట రాజు శబ్దమునకు - చంద్రుడు - రేడు అనుధర్మ ములు కలవు. కువలయ శబ్దమునకు కలువ - భూమి అను అర్థములు కలవు. రాజు భూమికి ఆనంద కరుడు; చంద్రుడు కలువలకు ఆనందకరుడు అని అనేకార్థములు వచ్చునట్టి పదములనుపయోగించి చెప్పుటయే, శ్లేషాలంకారము.

## (10) ఉత్ప్రేక్షాలంకారము (Poetical fancy)

ఉపమానము యొక్క గుణక్రియాదులు, ఉపమేయము నందు కనబడుటచేత, ఉపమేయమును ఉపమానముగా నూహించుట ఉత్ప్రేక్షాలంకారము.

ఈ చీకట్లను చక్రవాకాంగనల విరహాగ్ని ధూమముగా

దలచుచున్నాను. ఇచ్చట ఉపమేయమైన చీకటికి నల్లదనము, కన్నులు కనపడకుండ చేయుట, వ్యాపనము, అను గుణములు గలవు. ఉపమానమైన ధూమమునకును ఈగుణములు గలవు. చీకటులు చక్రవాక స్త్రీల విరహాగ్ని ధూమముగా నూహింపబడెను.

మరి కొన్ని ఉదాహరణములు :

1) ఈవెన్నెల పాలవెల్లియో అనునట్లున్నది.

2) క్రోధతామ్రాక్షుడైన శ్రీరాముడు ప్రళయకాలరుద్రుడో యనునట్లున్నాడు.

## (11) క్రమాలంకారము :

మొదట చెప్పిన వస్తువుల క్రమమునకు, భంగము లేకుండ, అనుగుణముగా తరువాత వస్తువులంజెప్పిన క్రమాలంకారము.

ధనమును, విద్యయు, లక్ష్మి సరస్వతులిత్తురుగాక.

ధనమిచ్చునది లక్ష్మి - విద్యనిచ్చునది సరస్వతి. అందువల్ల ఒకే క్రియ ఇరువురికి అన్వయించినది.

'' కసవుచే - నీటిచే - మోద కలనచేత
బ్రదుకు మృగ - మీన - సజ్జన ప్రకరములకు శబర కైవర్త సూచకజనులు జగతి
కారణము లేని పగవారు కారెతలప. ''

గడ్డిచే బ్రదుకుచున్న లేళ్లకు బోయవాండ్రును నీటిచే బ్రదుకుచున్న చేపలకు బెస్తవాండ్ర వల్లను ఆనందముచే బ్రదుకు

సజ్జనులకు కొంటెవాండ్రను కారణము లేని శత్రువులు. ఇట్లు క్రమముగా అర్థము స్వీకరింపవలెను.

## (12) కారణమాలాలంకారము :

ఒకదానికొకటి, కారణముగా వర్ణించిన, కారణమాలాలంకారమగును.

విద్యయెసగును వినయంబు, వినయముననుబడయు పాత్రత, పాత్రతవలన ధనము, ధనమువలనను ధర్మంబు, దానివలన నైహికాముష్మిక సుఖంబులందు నరుడు.

## (13) భ్రాంతి మదాలంకారము :

ఉపమానము ఉపమేయముగా గాని, ఉపమేయము ఉపమానముగా గాని భ్రమించుట.

శ్రీరాముని కీర్తి లోకమున వ్యాపింప చంద్రకాంత శిలలు జలము లూరు చున్నవి.

ఇందు కీర్తి యందు చంద్రుడని భ్రాంతి కల్గినది.

## (14) పరిణామాలంకారము :

ఉపమానము ఉపమేయముగా మారి క్రియను నిర్వర్తించిన, పరిణామాలంకారము.

ప్రసన్న మగు దృగబ్జమున హరిమిమ్ము వీక్షించును.

ఇందు దృక్కు అబ్జముగా (మారినను) ఆరోపింపబడినను, వీక్షించుట అబ్జమునకు సంభవింపదు. కాన ఉపమేయమగు దృక్కుగా మారి క్రియను నిర్వర్తించినది.

## (15) ఉల్లేఖాలంకారము :

అనేకులు అనేక విధముగా గాని, విషయమును బట్టి ఒకడే అనేక రూపములుగా గాని, ఆరోపింపబడిన ఉల్లేఖాలంకారము.

స్త్రీలు కాముడనియు, యాచకులు కల్పవృక్షమనియు, రిపులు యముడనియ్ను, ఈ రాజును దలంతురు.

మాటలలో గురువు-కీర్తి యందర్జునుడు - శరాసనమున భీష్ముడనియు నీతని దలంతురు.

## (16) దీపకాలంకారము :

ఉపమానమునకు, ఉపమేయమునకు, అనేక ధర్మములు చెప్పుట, దీపకాలంకారము.

మదముచే కలభమును, ప్రతాపముచే సూర్యుడును ప్రకాశింతురు.

ప్రకాశించుట అను ధర్మము ఉపమేయమగు కలభము నకు, ఉపమానమగు సూర్యునకు చెప్పబడినది.

మదముచే కలభము రాణించును.

ప్రతాపముచే సూర్యుడు ప్రకాశించును అని పదావృత్తి యున్న ఆ వృత్తి దీపకము.

## (17) వ్యతిరేకాలంకారము :

ఉపమాన, ఉపమేయములకు, భేదము చెప్పుట వ్యతిరేకాలంకారము.

శ్రీరాముడు కల్పవృక్షమేకాని భూమిలో ఉన్నది. ఇనుము విరిగిన నదుకును, మనసు విరిగిన నదుకదు.

## (18) నిదర్శనాలంకారము :

ఉపమాన ధర్మము ఉపమేయగతముగ చెప్పుట నిదర్శనము.

దాతకు సౌమ్యతయన చంద్రునకు కళంకము లేకుండుట.

ఇచ్చట సౌమ్యత అను ఉపమేయ ధర్మము, అకళంకితయను ఉపమాన ధర్మముగ చెప్పబడినది. హరిని వదలి అన్యులు గొల్చువాడు, కామధేనువును వదలి కాసరమును బిదుకును.

## (19) తుల్యయోగితాలంకారము :

కేవల ప్రకృతమునకుగాని, కేవల అప్రకృతములకు గాని, ఏక ధర్మమును చెప్పుట తుల్యయోగిత.

కలువలును - కాపురుష హృదయములును వికసింపనీ రాజు దయించెను.

కలువలు - కాపురుష హృదయములును, ప్రకృతములు - వానికి ఉదయించుట అను క్రియాయోగము చెప్పబడినది.

పామునకు పాలు పోసినను, విషము పోసినను ఫలమొక్కటియే.

## (20) వ్యాజస్తుతి :

స్తుతిచే నిందను గాని, నిందచే స్తుతిని గాని తెల్పుట వ్యాజస్తుతి.

ఆర్యా! నీవు మహనీయుడవు, పర ధనమును స్వధనముగా జూతువు.

శ్రీరామా! ఏమి నీ ఘనత. పాపులకు కూడ పరమపదము నిచ్చితివి.

## (21) అప్రస్తుతప్రశంస :

అప్రస్తుతముచే, ప్రస్తుతము తోచుట, అప్రస్తుత ప్రశంస.

సతీ! నీవేల పతిని వదలి పరుల ప్రశంసింతువు ?

ఇట రాముని వదలి అన్యునికొల్చువారి నింద ప్రస్తుతముగా దోచును. అట్లే—

అధికారుల ద్వారముల కాచియుండక ఆకలముల కాలము గడుపు చుండుటచే, హరిణమే ప్రశంస నీయము.

## (22) కావ్యలింగము :

సమర్థింపదగిన దాని, సమర్థించుట కావ్యలింగము. నా హృదయమున నీశ్వరుడు కలడు. కాముని గెల్చుటెంత ఘనకార్యము ?

కాముని గెల్చుట ఈశ్వరుడు హృదయమున నుండుటచే సమర్థితము.

## (23) వికస్వరాలంకారము :

విశేషమును సామాన్యముచే సమర్థించుచు దానిని సమర్థింప విశేషమును గూర్చుట. హిమాలయము రత్ననిలయము, దానికి హిమము కళంకము నీయదు. ఒక దోషము చంద్రమండలములో కళంకమట్లు గుణములలో లీనమగును.

హిమాలయము విశేషము. ఒక దోషము సామాన్యము. చంద్రమండలమున కళంకమట్లు అనునది తత్సమర్థక విశేషము.

## (24) సారాలంకారము :

ఉత్తరోత్తర ఉత్కర్ష వర్ణనము సారాలంకారము.

తేనె తీపి - తేనెకన్న అమృతముతీపి - అంత కన్న హరినామము తీపి.

## (25) సమాసోక్తి:

ప్రస్తుత విశేషణ సామ్యముచే అప్రస్తుతము తోచుట సమాసోక్తి.

సూర్యుడు నిస్తేజుడై అస్తగిరి గుహ, నణగు చున్నాడు.

ప్రస్తుతము కథకు సంబంధించినది. అప్రస్తుతము కథకు సంబంధింపనిది. ఇట రాజవృత్తాంతము అప్రస్తుతము తోచుచున్నది.

సూర్యుడు అనురక్తుడై పశ్చిమాశాముఖమును చుంబించుచున్నాడు.

## ప్రశ్నలు

1. శబ్దాలంకారము లెన్ని రకములు ? అవియేవి ?
2. ఛేకాలంకారము - లాటానుప్రాసమును సోదాహరణముగా దెల్పుము.
3. అర్థాలంకారము లనగా లేమి ?
4. (1) అతిశయోక్తి (2) రూపకాలంకారము (3) శ్లేష (4) రూపకాలంకారము (5) ఉల్లేఖాలంకారము - వీనిని సోదాహరణముగా దెల్పుము ?

## (7) దోష విభాగము

1) అక్షర దోషములు
2) పద దోషములు
3) వాక్య దోషములు

## దోష పరిచ్ఛేదము

### సామాన్య దోషములు

1. య - యి - యె - యేలును - వు - వూ - వొ - వో, లును ణ - ళ లును అచ్చికపదముల మొదట నుండవు.

| తప్పు | - ఒప్పు | తప్పు | - ఒప్పు |
| --- | --- | --- | --- |
| యతడు | - అతడు | యేమి | - ఏమి |

| | | | |
|---|---|---|---|
| యితడు | - ఇతడు | వొకటి | - ఒకటి |
| వున్నవి | - ఉన్నవి | వోడ | - ఓడ |
| వూరు | - ఊరు | ళక్క | - లక్క |
| యెవడు | - ఎవడు | ణళును | - నలును |

2) వట్రుసుడికి బదులు క్రావడిని - క్రావడికి బదులు వట్రుసుడిని వ్రాయరాదు.

| తప్పు | - ఒప్పు | తప్పు | - ఒప్పు |
|---|---|---|---|
| కృరము | - క్రూరము | వ్రుతము | - వ్రృతము |
| క్రుష్ణుడు | - కృష్ణుడు | ద్రుఢము | - దృఢము |
| దృతము | - ద్రుతము | వ్రుత్తాంతము | - వృత్తాంతము |
| వ్రుత్తము | - వృత్తము | అద్రుష్టము | - అదృష్టము |
| క్రుప | - కృప | ప్రభ్రుతులు | - ప్రభృతులు |
| మ్రుగము | - మృగము | స్రుష్టి | - సృష్టి |
| త్రుటి | - తృటి | ద్రుష్టి | - దృష్టి |
| విక్రుతి | - వికృతి | క్రుషి | - కృషి |
| మ్రుత్యువు | - మృత్యువు | త్రుతీయము | - తృతీయము |
| శ్రుంగారము | - శృంగారము | న్రుసింహుడు | - నృసింహుడు |
| క్రుతి | - కృతి | శతృవు | - శత్రువు |
| మితృడు | - మిత్రుడు | శ్రుంగము | - శృంగము |
| ప్రుధివి | - పృధివి | జ్రుంభణము | - జృంభణము |
| ధృవము | - ధ్రువము | దురద్రుష్టము | - దురదృష్టము |
| మ్రుదులము | - మృదులము | న్రుపాలుడు | - నృపాలుడు |
| వ్రుద్ధి | - వృద్ధి | అపహ్రుతము | - అపహృతము |

3) చై - జై వర్ణము లాదియందుగల, అచ్చికశబ్దము లుండవు

| తప్పు | - ఒప్పు | తప్పు | - ఒప్పు |
|---|---|---|---|
| చయిత్రము | - చైత్రము | చైదము | - చెయ్దము |
| జయిత్రము | - జైత్రము | చైవులు | - చెయువులు |

4) శ - ష - స లు తారుమారు చేసి వ్రాయరాదు.

| తప్పు | - ఒప్పు | తప్పు | - ఒప్పు |
|---|---|---|---|
| సిరస్సు | - శిరసు | విసాదము | - విషాదము |
| కసాయము | - కషాయము | సిష్యులు | - శిష్యులు |
| శీత | - సీత | నివశించు | - నివసించు |
| శెలవు | - సెలవు | సీతలము | - శీతలము |
| శైన్యము | - సైన్యము | వ్రాశినాడు | - వ్రాసినాడు |
| ప్రకాసించు | - ప్రకాశించు | కస్టము | - కష్టము |
| ఓశి | - ఓసి | ముస్టి | - ముష్టి |
| అభ్యశించు | - అభ్యసించు | నస్టము | - నష్టము |
| శీతారామయ్య | - సీతారామయ్య | అస్టావధానము | - అష్టావధానము |

5) సాధారణముగా 'స' కారము క్రింద నుండునది 'థ' కారమై యుండును.

| తప్పు | - ఒప్పు | తప్పు | - ఒప్పు |
|---|---|---|---|
| స్దానము | - స్థానము | ఆస్దానము | - ఆస్థానము |
| స్దిరము | - స్థిరము | సంస్ద | - సంస్థ |
| వ్యవస్ద | - వ్యవస్థ | స్దూలము | - స్థూలము |

6) శబ్దాది యందు ధకారమే యుండును.

| తప్పు | - ఒప్పు | తప్పు | - ఒప్పు |
|---|---|---|---|
| థనము | - ధనము | థాన్యము | - ధాన్యము |
| థృతి | - ధృతి | థార | - ధార |
| థవళము | - ధవళము | థీరుడు | - ధీరుడు |
| థనువు | - ధనువు | థారాళము | - ధారాళము |
| థన్యుడు | - ధన్యుడు | థీమంతుడు | - ధీమంతుడు |
| థమ్మిల్లము | - ధమ్మిల్లము | థనంజయుడు | - ధనంజయుడు |
| థట్టివి | - ధట్టివి | థరణి | - ధరణి |
| థూపము | - ధూపము | థర | - ధర |

7) సాధారణముగా 'ద' కారము క్రింద, 'ధ' కారమే యుండును.

| తప్పు | - ఒప్పు | తప్పు | - ఒప్పు |
|---|---|---|---|
| బద్దము | - బద్ధము | రుద్దము | - రుద్ధము |
| యుద్దము | - యుద్ధము | సిద్దము | - సిద్ధము |
| సన్నద్దము | - సన్నద్ధము | సిద్దాంతము | - సిద్ధాంతము |

8) సాధారణముగా 'త' కారము క్రింద 'ద', కారమే యుండును.

| తప్పు | - ఒప్పు | తప్పు | - ఒప్పు |
|---|---|---|---|
| అశ్వత్థామ | - అశ్వద్ధామ | ఉత్థానము | - ఉత్థానము |
| ఉత్థితము | - ఉత్థితము | ఉత్థము | - ఉత్థము |

9) థ - ధ లకు భేదము గుర్తించవలెను.

| 'థ' గల పదములు | | 'ధ';గల; పదములు | |
|---|---|---|---|
| కథ | - పథము | అంధుడు | - అధముడు |
| ప్రథమము | - రథము | బధిరుడు | - అర్ధము (సగము) |
| అర్థము | - అర్థి | సుధ | - బుధుడు |
| చతుర్థము | - అర్థకము | | |
| తిథి | - సార్థకము | | |

10) ఒత్తులు తార్మారు చేయరాదు.

| తప్పు | - ఒప్పు | తప్పు | - ఒప్పు |
|---|---|---|---|
| భేధము | - భేదము | సంబందము | - సంబంధము |
| భంధువు | - బంధువు | భోదించెను | - బోధించెను |
| భాద | - బాధ | భోద | - బోధ |

11) ఖ - ఘ లను తారుమారు చేయరాదు.

| తప్పు | - ఒప్పు | తప్పు | - ఒప్పు |
|---|---|---|---|
| ఘరము | - ఖరము | సుఘము | - సుఖము |
| నఘరము | - నఖరము | లేఘ | - లేఖ |
| మేఖము | - మేఘము | ఖనము | - ఘనము |
| సంఖము | - సంఘము | శంఘము | - శంఖము |

12) వచ్చు - వెళ్ళు మొదలగు హలాదులను అజాదులుగా వ్రాయరాదు.

| తప్పు | - ఒప్పు | తప్పు | - ఒప్పు |
|---|---|---|---|
| వాడొచ్చెను | - వాడువచ్చెను | అతడొంపెను | - అతడుపంపెను |
| వీడెళ్లెను | - వీడువెళ్లెను | అతడినెను | - అతడువినెను |

13) ద్రుతప్రకృతికముపై యకారాగమము చేయరాదు.

| తప్పు | - ఒప్పు |
|---|---|
| వానిని యెందువలన | - వానినెందువలన |
| అంతయొకనాడు | - అంతనొకనాడు |
| తరువాతయనెను | - తరువాతననెను |
| వనమునయుండెను | - వనముననుండెను |

14) ఉకారముపై యకారము కూడదు.

| తప్పు | - ఒప్పు |
|---|---|
| వాడు యుండెను | - వాడుండెను |
| రాముడుయనెను | - రాముడనెను |

15) కళలపై నకారమురాదు :

| తప్పు | - ఒప్పు |
|---|---|
| చూచినడిగితి | - చూచియడిగితి |
| చదివి నుంటివి | - చదివి యుంటివి |
| చదువక నుండెను | - చదువక యుండెను |

15A) ఇంకన్ - చాల - వీనికి దీర్ఘమిచ్చి వ్రాయరాదు.

ఇంకా నిన్ను కూడా చాలా తిట్టెను (తప్పు)

ఇంక నిన్ను కూడ చాల తిట్టెను (ఒప్పు)

16) సముచ్చయము ద్విత్వముగా వ్రాయరాదు

నేనున్నూ - రాముడున్నూ - చూచితిమి (తప్పు)

నేనును, రాముడును చూచితిమి (ఒప్పు)

17) దుష్టహల్సంయోగము కూడదు.

| తప్పు | - ఒప్పు |
|---|---|
| తత్చమము | - తత్సమము |
| ఉప్పాతాలు | - ఉత్పాతాలు |
| ఉచ్ఛాహము | - ఉత్సాహము |

18) ప్రత్యయములు ఇష్టమువచ్చినట్లు చేర్చరాదు.

| తప్పు | - ఒప్పు | తప్పు | - ఒప్పు |
|---|---|---|---|
| వాడికి | - వానికి | ఇతణ్ణి | - ఇతనిని |
| వీడికి | - వీనికి | వాడిని | - వానిని |
| రాముడికి | - రామునికి | రాముడితో | - రామునితో |
| ఎవడికి | - ఎవనికి | ఎవడియొక్క | - ఎవనియొక్క |
| వాటికి | - వానికి | వాణ్ణి | - వానిని |
| రాముణ్ణి | - రాముని | వీటికి | - వీనికి |
| ఎవణ్ణి | - ఎవనిని | | |

19) ప్రథమా ప్రత్యయము మార్చరాదు.

| తప్పు | - ఒప్పు | తప్పు | - ఒప్పు |
|---|---|---|---|
| అతను | - అతడు | వనం | - వనము |
| ఇతను | - ఇతడు | ధనం | - ధనము |
| ఈతను | - ఈతడు | పుస్తకం | - పుస్తకము |

20) క్రియలను ఇష్టము వచ్చినట్లు వ్రాయరాదు.

| తప్పు | - ఒప్పు | తప్పు | - ఒప్పు |
|---|---|---|---|
| అంటాడు | - అనును | వస్తాను | - వచ్చెదను |

| | |
|---|---|
| చెప్పుతుంది- చెప్పుచున్నది | వెళ్తాడు - వెళ్లగలడు |
| ఎగురుతవి - ఎగురును | వ్రాస్తున్నాడు - వ్రాయుచున్నాడు |

**21)** ఔప విభక్తికములను సామాన్య శబ్దములుగా, వాడరాదు. ఇ -తి - టి చేర్చక వాడరాదు.

| తప్పు | - ఒప్పు |
|---|---|
| నేయితోకల్పుము | - నేతితోకలుపుము |
| ఇల్లునుచూడుము | - ఇంటిని చూడుము |
| కాలుతోతన్నెను | - కాలితో తన్నెను |

**22)** లింగవచన విరోధము కూడదు.

లింగవిరోధము -

గోపాలుడింటికి వచ్చు చున్నది (తప్పు)
గోపాలుడింటికి వచ్చు చున్నాడు (ఒప్పు)

ఆవు పాలిచ్చును - ఆమెకు మేత వేయుము (తప్పు)
దానికి మేత వేయుము (ఒప్పు)

చెట్టు కాయు చున్నది. వానికి నీరు పోయుము (తప్పు)
దానికి నీరు పోయుము (ఒప్పు)

వచన విరోధము :-

రాముడు వచ్చుచున్నారు - రాముడు వచ్చు చున్నాడు.
జనులు వచ్చెను - జనులు వచ్చిరి.

**23)** విశేషణ విశేషలింగ విరోధము కూడదు.

| తప్పు | - ఒప్పు |
|---|---|
| దుష్ట యగుసుయోధనుడు | - దుష్టుడగు సుయోధనుడు |

మనోహరమగు బాలుడు - మనోహరుడగు బాలుడు
ప్రియమగు పుత్రుడు - ప్రియుడగు పుత్రుడు

**24)** ప్రార్థనార్థక - మువర్ణము అచ్చు పై లోపింపదు.

ఒప్పు - తప్పు
చూడుమనియె - చూడనియె
నడువుమనుచు - నడువనుచు
కొట్టుమిపుడు - కొట్టిపుడు

**25)** ధాతువునకు - కామపరమైన యు కారమునకు సి ఆదేశముగ వచ్చును.

తప్పు - ఒప్పు
చేయుకొను - చేసికొను
వ్రాయుకొను - వ్రాసికొను
మోయుకొను - మోసికొను

**26)** పురుషదోషములు కూడవు.
తాము గెలిచెనని తెలిసి కొనెను (తప్పు)
తాము గెలిచితిమని తెలిసికొనిరి (ఒప్పు)

మీరు ఎపుడు వచ్చిరి? (తప్పు)
మీరు ఎప్పుడు వచ్చితిరి? (ఒప్పు)

**27)** పునరుక్తి దోషము :

తప్పు - ఒప్పు
హిమాలయ పర్వతము - హిమాచలము
అగ్గినిప్పు - అగ్గి (లేక) నిప్పు

28) ప్రార్థనార్థక క్రియలు వ్యతిరేకార్థమిచ్చునట్లు వాడరాదు.

| తప్పు | ఒప్పు |
|---|---|
| చేయమనియె | చేయుమనియె |
| వెళ్లమనియె | వెళ్లుమనియె |
| ఒసగమనియె | ఒసగుమనియె. |
| ఆడమనియె | ఆడుమనియె |

29) ఐకారమును, తావత్తును తారుమారు చేయరాదు.

పెత్తనము - పెత్తనము     కైత - కైత

30) రెండు రేఫములుండుచోట శకట రేఫమే వాడవలెను.

గుర్రము - గుఱ్ఱము.     గొర్రె - గొఱ్ఱె

బర్రె - బఱ్ఱె     కర్ర - కఱ్ఱ

31) శకటరేఫ ఇంకొక హల్లుతో కూడియుండదు.

| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| గుఱ్తు | గుర్తు | మాఱ్పు | మార్పు |
| కూఱ్పు | కూర్పు. | | |

## ప్రశ్నలు

ఈ క్రింది వాని దోషములను సరిదిద్దుము.

1) వున్నవి. 2) ద్రుధము. 3) ప్రుధివి. 4) చయిత్రము. 5) సిరస్సు (6) థనము (7) భేధము (8) సుఘము (9) వాడొచ్చెను (10) చూచినడిగితి (11)ఉచ్చాహము (12)వాటికి (13) ఈతను (14) ఇల్లును చూడుము (15) కైక (16) బర్రె (17) గుఱ్తు (18) హిమాలయ పర్వతము. (19) ఆడమనియె (20) వెళ్తాడు.

# 8. వ్యాస లేఖన విభాగము

I. 1. వ్యాసము - వివరణము. 2. వ్యాసము - రకములు

వ్యాసము నాల్గు విధములుగా విభజించవచ్చును. అవి 1) సాహిత్య వ్యాసములు 2) శాస్త్రీయ వ్యాసములు 3) విషయ ప్రధాన వ్యాసములు 4) సమస్యాత్మక వ్యాసములు

వ్యాసములను మరియొక విధముగా విభజించి మూడు భాగములుగా చేయవచ్చును.

1. వృత్తాంతవ్యాసములు Narrative Essays
2. వర్ణన వ్యాసములు Descrptive Essays
3. వివరణ వ్యాసములు Reflective Essays

**1. వృత్తాంత వ్యాసములు:-** శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, గాంధీ మొదలగు మహనీయుల జీవిత వృత్తాంతములును, యుద్ధాదుల వృత్తాంతములును, వివాహాది ధర్మములయు, పండుగలయు, వృత్తాంతములును, నిజమైన కథలును, కల్పనాకథలు ఇందు జేరును.

**2. వర్ణన వ్యాసములు:-** జంతువులను గాని, చెట్లను గాని, పట్టణములను గాని, దేశములను గాని, దృశ్యములను గాని, ఆనకట్టలు, ఇనుపదారులు, మొదలైన నిర్మిత వస్తువులను గాని, వర్ణించుచు వ్రాసిన వ్యాసములు ఈ వర్ణమునకు చేరును.

**3. వివరణ వ్యాసములు:-** ఏదియో ఒక అంశమును ఎన్నుకొని, అందలి మంచి చెడ్డలను, సమీక్షించుచు, వ్రాసిన వ్యాసము వివరణ వ్యాసము. సత్యము, రాజకీయాంశములు, సాంఘిక, నైతిక, మత విషయములిందు చేరును. రచనా విధానమును బట్టి యొకప్పుడు వర్ణన వ్యాసము, వివరణ వ్యాసముగను, వివరణ వ్యాసము వృత్తాంత వ్యాసముగను మార్పుచెందు చుండును. వ్యాసమున శైలియు - క్రమమును ప్రధానాంశములు.

**శైలి అనగా ఉచిత వాక్యరచన:**

1) వ్యాసమున సాధారణముగా వాడుక భాషయే యుండవలెను. కాని నిఘంటువులలోని మారుమూల పదముల వాడరాదు.

2) వ్యాకరణ విరుద్ధమగు భాష ఉపయోగింపరాదు. ఈనాడు చెప్పబడు శిష్ట వ్యవహారకమును గాని వాడవచ్చును.

సందర్భమును బట్టి, తమ కున్న అనుభవమును పురస్కరించుకొని, గొప్పవారి సూక్తులు ప్రయోగింప వచ్చును. జాతీయములు వ్యాసమునకు పుష్టినిచ్చును. విషయ విభజనము జాగ్రత్తగా చేయవలెను. వ్యాసమును సాధారణముగా (1) శీర్షిక (2) ఉపోద్ఘాతము (3) వ్యాస చర్చ (4) లాభ నష్టములు (5) ఉపసంహారము అను భాగములుగా వ్రాయవచ్చును.

**శీర్షిక:** వ్యాసము పేరు - దానికి సంబంధించిన వివరణ మిందుండును.

ఉపోద్ఘాతము: వ్యాస విషయమిందు ప్రవేశ పెట్టబడును. ఈ వ్యాసమునకు సంబంధించి ప్రసిద్ధ పురుషుల వాక్యములిందు పేర్కొన వచ్చును.

వ్యాసచర్చ: వ్యాసమునకు సంబంధించిన చర్చ యిందుండును. స్వీయానుభవమును జూపించి వ్యాసమును ఇందు విపులీకరించవలెను.

లాభ నష్టములు: వ్యాస చర్చలో తేలిన సారాంశమును క్రమ పద్ధతిలో చేర్చి వ్రాయవలెను.

ఉపసంహారము: ఇది వ్యాసమునకు ముగింపు. వ్రాసిన వ్యాసముపై తనకు గల అభిప్రాయమునుగాని, మహాపురుషుల అభిప్రాయములు గాని చేర్చి ముగించవలెను.

వ్యాసము క్రమ పద్ధతిలో, నిర్మాణాత్మకముగా నుండి పాఠకులకు అభిరుచిని కల్గించవలెను.

(1) వృత్తాంత వ్యాసములు: 1. భరతుడు 2. శ్రీకృష్ణ దేవరాయలు 3. శివాజి 4. అక్బరు 5. బుద్ధుడు

(2) వర్ణన వ్యాసములు: 1. గోవు 2. ఏనుగు 3. హైదరాబాదు 4. హస్తినాపురము 5. గోదావరి

(3) వివరణ వ్యాసములు:

1. సినిమాలు చూచుట వలన లాభనష్టములు
2. విజ్ఞాన యాత్రలు-ప్రాముఖ్యము
3. గ్రంథాలయములు-ఆవశ్యకత
4. వార్తాపత్రికలు
5. కాలము - విలువ
6. శీలము
7. మితవ్యయము
8. మద్యపాన నిషేదము
9. దేశ భక్తి
10. సాంకేతిక విద్య
11. ప్రజాస్వామ్యము - రాచరికము
12. వయోజన విద్య
13. శాస్త్ర విజ్ఞానము
14. యుద్ధము - నష్టములు
15. అడవులు - ప్రాముఖ్యము
16. వాతావరణ కాలుష్యము
17. లలిత కళలు
18. విద్యార్థులు-రాజకీయములు
19. ఆహారసమస్య
20. అణుశక్తి-ప్రయోజనములు
21. ఉగ్రవాదము
22. సాహిత్యము - సమాజము
23. మాతృ భాషలో విద్యా బోధన
24. దేశ సమైక్యత
25. అలీనోద్యమము.

## విరామ చిహ్నములు

1. కామా (Camma) వాక్యాంశ బిందువు (,)

అసమాపక క్రియలందవలను, సముచ్చయాదులను, కొద్ది కాలమాపవలసి వచ్చినపుడు ప్రయోగించవలెను.

ఉదా: ఆంజనేయుడు సముద్రమును దాటి, లంకను జేరెను. అశోక వనమున ప్రవేశించి, జానకిని జూచెను.

2. సెమి కోలన్ - (Semi Colon) అర్ధ బిందువు (;)

వాక్య సముచ్చయ్యములకు ముందు ప్రయోగింపబడును.

శ్రీరాముడు సుగ్రీవునకభయ మిచ్చెను; అయిన అతడు నమ్మలేదు.

3. కోలన్ (Colon) వ్యాస బిందువున్యాస దూర.

(:) సంబంధము గల వాక్యముల చివర నీ గుర్తుండును. ఈ వ్యాస బిందువు ఒక అడ్డ గీతతోకూడి ఉదాహరణముగా సూచించును.

ఉదా : ఉత్పలమాల :- ఒక సమ వృత్తము

4. (Full Stop) బిందువు.

(.)వాక్యాంతమునను, నామైక దేశగ్రహణమునను దీనినుపయోగింతురు.

ఉదా :- భగవంతుడే రక్షకుడు. (కా.వీ)

(కావూరు వీరయ్య)

5. ప్రశ్నార్థక చిహ్నము Question Mark (?)

ప్రశ్న వాక్యాంతమున నుండును.

ఉదా :- నీపేరేమి ? వారెవరు ?

6. ఆశ్చర్యార్థక చిహ్నము (Note of exclamation) (!)

ఆశ్చర్యార్థక వాక్యాంతమునను, సంబోధనాంత వాక్యాంతమున నుపయోగింప బడును.

ఉదా :- ఆహో ! ఓహో !

రామా ! కృష్ణా !

7. కుండలన (Bracket) - ముందు పదమునకే

( ) వివరణమయి, అనవసరమైనవాని నీ చిహ్నములో నుంతురు.

ఉదా :- ద్రుతము (నకారము) చివర గలవి. ద్రుతాంతములు.

8. ఉద్ధరణ చిహ్నము (Inverted Commas)

(" ")

ఉదా:- దశరథుడు "రామా ! నీ వరణ్యమునకు వెడలు" మనలేక విలపించి మూర్ఛిల్లెను.

9. అవగ్రహము (Aposhophy) (Z)

ధ్వనితోనేకీభవించి హ్రస్వ అకారము లోపించినపుడు ఇది ఉపయోగింపబడును.

ఉదా :- వయోzం బుద్ధి

రమాzనుజాడు మొదలైనవి.

10. లోప చిహ్నము (Ellipses) చెప్పవలసిన

(...)దానిలో కొంత లోపించిన దీని నువయోగింతురు.

" భాను సమాన...ఉత్పలమాల యైచనున్ "



* * *